# మన రైతు పెద్ద

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

దేశికవితా మండలి
ఘంటసాల :: బెజవాడ

# అంకిత పత్రిక

* *
*

సు పవిత్ర పత్రిక చేతను
విమలవర్తనమల్లను
గురుపాదులయిన
కళాతపస్వులగు
శ్రీయుత ముట్నూరి కృష్ణారావుగారి
దివ్యస్మృతికి

*
* *

## ద్వితీయ ముద్రణకు

# పీఠిక



చరిత్రకారులలో శిల్పులు కొందఱును, కర్మకారులు కొందఱును (Artists and Artisans) ఉందురు. కర్మకారుడు వ్రాసిన చరిత్ర, పేర్చిన ఇటుకలవలె, భూతార్థముల పట్టిక. శిల్పి రచించినది, గోపుర నిర్మాణమువలె, సముచిత – అంగ – ప్రత్యంగ – సౌష్ఠవము గల సుందర కళామూర్తి. ఈ నిర్మాణములో, శిల్పి యవలంబించు ముఖ్యసూత్ర మిది — వికీర్ణములైయున్న భూతార్థములను సమీకరించుట, సమీకరించినవానిని వ్యాకరించుట, వ్యాకరించినవానిని సమన్వయించుట. ఈ ధర్మము పరిపాలింపబడినప్పుడు చారిత్రిక విషయము కావ్యవస్తువుగా రూపొందును. ఆ రూపమును, రమణీయమైన శైలిలో చిత్రించిననాడు చరిత్ర కావ్యమే యగును. శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు రచించిన యీ "మన పెద్ద" చాలవరకు ఇట్టి శిల్పమర్యాదలతో రచింపబడిన జీవితచరిత్ర.

ఈ జీవితచరిత్రకు కథానాయకుడైన శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, మహాత్ముడు ఉపక్రమించిన యసహకారోద్యమనాటినుండి నేటివఱకు, దేశసేవకే జీవితము అంకితము చేసికొని నానావిధముల ప్రజాహితైకపరాయణులై యున్న వ్యక్తి. కావున ఈ జీవితచరిత్ర ఆంధ్రదేశ కాంగ్రెసు చరిత్రగా పరిణమించినదనియు చెప్పవచ్చును. ఇందులో బ్రహ్మయ్యగారి ఆత్మీయ చరిత్రాంశకు ఎంతవా లుండవలెనో, కాంగ్రెసు చరిత్రాంశకు ఎంతవా లుండవలెనో సముచితనిర్ణయము చేసి ఉభయప్రాధాన్యము చెడకుండ పచరించుటలో గ్రంథకర్త చూపిన వస్తువిన్యాసనైపుణి ప్రశంసార్హముగా నున్నది. మరియు, ఈ కథకు ప్రథమరంగమైన నూటుసాలగ్రామమును, కథానాయకుని ఆత్మీయతావికాసమునకు కారణభూతులైన గురువులను, మిత్రులను, బంధువులను యథావస్థముగా చిత్రించుటలో సుబ్బయ్యగారు చూపిన నేర్పు ఈరచనకు ఇంకొక వన్నె పెట్టినది.

మహాత్ముడు బ్రిటిషుపరిపాలనతో సల్పిసిన ధర్మసంగ్రామములో శత్రుదుర్భేద్యముగా నిల్చిన దుర్గములలో ఘంటసాల యొకటి. అకుంఠిత శౌర్యదీక్షతో ఆ దుర్గమును సంరక్షించిన యోధుడే యీ కథానాయకుడు. ఈ దుర్గాధిపతికి ఎప్పటికప్పుడు ఆదేశసందేశము లిచ్చుచు వ్యూహరచనాకుశలుడై కృష్ణామండలముయొక్క యెల్లలలో శత్రుసేనలను కాలు నిల్వకుండ పట్టాపంచలుచేసిన మహామంత్రి శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు. ఆ మంత్రియే ఈ దుర్గపాలకునకు మొదటి గురువు. ఆయనయొద్ద ఈయన నేర్చిన విద్య సచివత్వము, యుద్ధతంత్రము. రెండవ గురువైన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు చేసినది ధర్మోపదేశము. ఈ గురుద్వయముయొక్క యుపదేశములను, తన యాచరణ ప్రచారముల ద్వారా శిష్యునిచే చింతన చేయించిన గురుతుల్యుడు శ్రీ చెరుకువాడ నరసింహంపంతులుగారు. బ్రహ్మయ్యగారి గురుసంప్రదాయ మిది. ఈ గురుత్రయమునకు నివాస మగుటచేతనే, బందరు పట్టణము కాంగ్రెసు రాజ్యములో ఆంధ్రరాజధాని యైనది. ఆ బందరు పట్టణమున విద్యాభ్యాసము చేయుటయు, ఆ మువ్వురసాన్నిధ్యమున మెలగుటయు బ్రహ్మయ్యగారి ఆత్మవికాసమునకు హేతువులు.

వెంకటసుబ్బయ్యగారి మానసిక వికాసమునకును ఆ బందరే, ఆ గురుత్వమే హేతువు. బ్రహ్మయ్యగారికి లభించిన రాజకీయప్రాముఖ్యమును, వెంకటసుబ్బయ్యగారికి ప్రాప్తించిన సారస్వతప్రసిద్ధియు ఆవికాసముయొక్క ఫలరూపములు.

వీరిర్వురును, చినతనమాదిగా సహవాస, సాహచర్య, సహాధ్యయనములు చేసిన ధర్మసోదరులు. ఏకగ్రామవాస్తవ్యులు. కథాపురుషున కింత సన్నిహితుడు గనుకనే కథకుడు ఈ కథనమునకు ఉత్తమాధికారి యయ్యెను. జీవిత చరిత్ర వ్రాయువారందరకును ఇట్టి యదృష్టము కల్గదు. ఒకవేళ కలిగినను మైత్రీప్రేరితమైన మమతాదోషదూషితము కాకుండ, రచనను తటస్థభావముతో సాగించుట అతిక్లేశము. ఈ రచనకు అట్టి కళంకము రాలేదు. ఎచ్చటను అతిశయోక్తులుగాని, మెరమెచ్చులుగాని, అనుచిత తిరస్కారములుగాని, అనావశ్యక పురస్కారములుగాని ఈ గ్రంథమున కానరావు. ఆద్యంతము, అంతశ్శుద్ధితో నొనర్చిన మితహిత వాక్యబంధురమైన సత్యకథనము. ఈ ఫణితిలో, వెంకటసుబ్బయ్యగారు సమగ్ర-ఆంధ్రజాతి చరిత్ర వ్రాసిన యెట్లుండునో ?

బ్రహ్మయ్యగారి వ్యక్తినిరూపణలో గ్రంథకర్తకైకొన్న మూల సూత్రము, ఆయన రైతుతనము. ఆంధ్ర రాజకీయములలో కార్యఖడ్గములకు చాలిన మంత్రియు యోధుడునునైనను బ్రహ్మయ్యగారు ఘంటసాలరైతే. పెద్ద రైతు కాకపోయినను రైతుపెద్ద. రైతులోకములో ఈయన కీ పెత్తనము వచ్చుటకు కారణము తనరైతుతనమును మరచిపోకుండుట. మరచిపోకుండుటే కాదు, విడనాడకుండుట. ఆంధ్రకాంగ్రెసు కమిటీకి కార్యదర్శియై గ్రామైక రాత్రముగా సంచారములు చేయుచుండినప్పుడును, బ్రిటిషువాని రాక్షసాగ్రహమునకు పాత్రుడై కారాగారములో బంధితుడై యుండినప్పుడును, ఈయన యాత్మ పొలముగట్టుల, పసులకొట్టముల, పల్లెరచ్చపట్టుల సంచరించుచునే యుండెను. తా నెట్టిపదవిలో నున్నను రైతు ననెడి అభిమానమును గోలుపోలేదు గనుకనే, భారతపునరుద్ధరణమునకు మహాత్ము డుపదేశించిన, గ్రామము–రైతు, అను శబ్దద్వయమంత్రమును జపించి సిద్ధిపొందినవాడయ్యెను.

రైతులు, అందును, మెట్టపరగణాయైన (ఇప్పుడు చాలవరకు పల్లమే) మా దేవరకోట సీమలోని రైతులు శాంతవీరులు. నిష్కాపట్యము, కార్యదీక్ష, ఆదరము, సాధుత్వము, సమయజ్ఞత, ఆత్మగౌరవము వారికి పెట్టని నగలు. బ్రహ్మయ్యగారి ప్రకృతి నలంకరించినవియు అనగలే. ఆయనను చూడగనే, పై లక్షణములుగల, అచ్చపు దేవరకోటసీమరైతుగా గుర్తుపట్టవచ్చును. స్వభావమునుబట్టి, నడవడినిబట్టి, ఆకారమునుబట్టి, మూర్తీభవించిన రైతుతనము గావుననే ఈయన రైతుపెద్ద. ఈగ్రంథము సమర్థించినది ఈరహస్యమే.

ఎందరో, ఇట్టి సుగుణఖనులు, కార్యచతురులుగల మన యాంధ్రజాతికి ఈదుస్థితి యేల? సమాధాన మీ గ్రంథాంతిమున గలదు. దానిని చదివి ఇతరులను కెలియక, ఎవరికివారే ఆత్మపరీక్ష చేసికొందురుగాక. ఈ గ్రంథమునకు ఆ పంక్తులే ఫలశ్రుతి.

వాశేరు
26–2–'49 } పింగళి లక్ష్మీకాంతం

## ప్రథమ ముద్రణకు
# పీఠిక



"ఏమండీ? అన్నగారూ!"

"ఎప్పుడొచ్చావ్, బాబాయ్?"

"బొత్తిగా శీతకన్నువేశారు; బావగారు!"

"ఎప్పుడో ఊళ్ళోకి దిగారే, వియ్యంకుడుగారు!"

"పిల్లా మేకా క్షేమమా; తమ్ముడూ?"

ఈ విధంగా శ్రీ బ్రహ్మయ్యగారు ఎందరెందరినో పలకరించగా విన్నాను. ఆయనకు నేను జాబులు వ్రాయడం "శ్రీ బ్రహ్మయ్యగారికి" అంటూ, ఆయన జవాబులు రాయడం "తమ్ముడూ!" అంటూ.

ఏదో ఒక వరస కలుపుకొనకపోతే, ఎవ్వరితోనూ ఆయన వ్యవహరించనే లేదు. ఇతరవరసలు కలుపుకొననిచోట "తాత, మనుమడు" వరస తప్పదేమో కూడా!

ఈనాడు త్వరితగతిని గతించిపోతున్న మన గ్రామీణ సంస్కృతి విశిష్టత—వాస్తవానికి అదే భారతీయ సంస్కృతికి సంయితం కాదా?—ఆ సంస్కృతి విశిష్టతను బ్రహ్మయ్యగారిలో చూడవచ్చు. ఆదరణ, ఆప్యాయం, నిష్కాపట్యం, నిరాడంబరత్వం, శాంతం, సహనం, సౌభాగ్యం, ఉదాత్తత ఈ గుణగణాలే ఆ సంస్కృతికి ఆయువుపట్టులు. ఈ గుణగణాలన్నీ శ్రీ బ్రహ్మయ్యగారిలో కలవనడం అత్యుక్తి కాదు.

ఇతరుల విషయం చెప్పలేనుగాని, నాకుమాత్రం శ్రీ బ్రహ్మయ్యగారిని కలుసుకున్నప్పుడు—ఆయన కలుపుగోలుతనాన్ని చూచినప్పుడు—హాస్యంతో కూడిన ఆయన మాటలు వింటున్నప్పుడు—మన గ్రామీణ సంస్కృతిపట్ల ప్రేమ

పెరుగుతుంది. అది నశించిపోతున్నందుకు విచారం హెచ్చుతుంది. ఇంతే కాదు; "నేను" "నాది" "నీవు" "నీది" అనేవి పునాదులుగా, "ఎంత గడించాడు ? ఎన్ని మేడలు మిద్దెలు కట్టాడు ?" అనేవి కొలతబద్దలుగా అంతకంతకు బలపడుతున్న నూతనసంస్కృతిపట్ల కోపం పెరుగుతుంది; అసహ్యం ప్రబలుతుంది.

అన్యసంస్కృతులలోని_ముఖ్యంగా ఆధునిక పాశ్చాత్య సంస్కృతిలోని_విశిష్టవిషయాలను మనం స్వీకరించరాదని నా తాత్పర్యం కాదు. నూతన సంస్కృతులతో సంపర్కం పెట్టుకొనని జాతికి, అట్టి సంపర్కంద్వారా స్వీయసంస్కృతిని పరిపుష్టంచేసుకొనని జాతికి, భవితవ్యమే లేదు. కాని, అన్య సంస్కృతుల వ్యామోహంలోపడి స్వీయసంస్కృతిని నాశనం చేసుకొనే జాతి తన వ్యక్తిత్వాన్నే చంపుకొంటుంది; తన ఆత్మనే అమ్ముకొంటుంది.

శ్రీ బ్రహ్మయ్యగారు ఎంతగా గ్రామీణులైనా, మరెంతగా గ్రామీణ సంస్కృతి విశిష్టత ఆయనలో కానవచ్చినా, ప్రస్తుతం మనదేశంపై బలీయంగా పడుతున్న పాశ్చాత్య సంస్కృతి ప్రభావంకూడా ఆయనలో కానవస్తుంది. ఆయన నాగలినిపట్ట నేర్చినవాడే కాదు; మోటారుకారను ఉపయోగించ నేర్చినవాడుకూడా. వీధి అరుగుపై కూర్చుని, పల్లెటూరి తగవులు తీర్చ నేర్చిన వాడే కాదు; లిమిటెడ్ కంపెనీలను మేనేజింగ్ డైరెక్టరుగా నిర్వహించ నేర్చినవాడుకూడా. గిత్తలను నాణ్యంచేయ నేర్చినవాడే కాదు, గవర్నమెంటుకు సలహాలివ్వ నేర్చినవాడుకూడా. పల్లెలోవలె పట్టణంలోకూడా ఆయన తన ప్రత్యేకతను నిలుపుకోగలడు; గ్రామీణులలోవలె నగరవాసులలోకూడా, ఆయన తన విశిష్టతను నిరూపించుకోగలడు.

అయితే నేను శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి గ్రంథానికి పీఠికను ప్రారంభించి, శ్రీ బ్రహ్మయ్యగారి జీవితచరిత్రకే ఉద్యమిస్తున్నట్టున్నాను. ఇది సాహసం. దీన్ని దుస్సాహసమన్నా తప్పులేదు. శ్రీ వెంకటసుబ్బయ్యగారినిమించి శ్రీ బ్రహ్మయ్యగారి జీవితచరిత్ర రచనకు అధికారం గలవారు లేరు. వారిద్దరిది ఒకే గ్రామం; దాదాపు ఒకేవయస్సు; ఆబాల్యం వారిద్దరు స్నేహితులు, సన్నిహితులు. వీటి నన్నిటినిమించి, శ్రీ వెంకటసుబ్బయ్యగారి నిష్పాక్షిక దృష్టి ఎందరికి గలదు ? ఆయన లేఖిని నిశితమైనా సామాన్యమైనదా ? శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు గురుపాదులైనందుకు

# అభిప్రాయములు

తన అభిప్రాయము పంపినందుకు గురుతుల్యు లగు శ్రీయుత చెరుకువాడవారికి, ఆంధ్రసాహిత్యక్షేత్రములలో పలుపంటలు పండించి ప్రఖ్యాతులైన పెద్దరైతు లగు శ్రీ విశ్వనాథవారికి కృతజ్ఞతాపూర్వకవందనములు.

గ్రంథకర్త.

“మిత్రుడు చిరంజీవి గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారిని నేను చాల చిన్నతనమునుండి బాగా యెరుగుదును. అతని స్వగ్రామ మగు ఘంటసాల నాకు మాతామహస్థానమును జన్మస్థానము నగుటచేతను, మా జ్యేష్ఠసోదరి కూడా ఆ గ్రామవాసినిగా నుండుటచేతను నా కా గ్రామములోని చిన్నపెద్ద లందరితోను మిక్కిలి సన్నిహితపరిచయము కలదు.

ఇతను వ్రాసిన ‘ఘంటసాలచరిత్ర’ ‘ఆచార్య రంగా’ ‘మన రైతు పెద్ద’ అనే గ్రంథముల నిటీవలనే చూచి చాల సంతోషించినాను.

ఈ ఘంటసాల గ్రామచరిత్రను నన్ను వ్రాయమని నా మిత్రుడు కీ॥ శే॥ కాశా శివరామశాస్త్రిగారు 25 సంవత్సరములక్రిందట యెంతో ప్రోత్సహించెను. నేటికి కా పని మిత్రుడు వెంకటసుబ్బయ్యగారు సమగ్రముగా నిర్వహించుట మిక్కిలి సంతోషపడినాను. ఇతని రచనాకౌశలము చాల ప్రశంసనీయముగా నున్నది.

సన్నిహిత సమకాల సమవయస్కుల ఔద్ధత్యమున కానందించుటయే గాక, వారి గుణగణ పరిశీలనాప్రావీణ్యముచే నితని హృదాంతర సుజ్ఞత ప్రకటిత మగుచున్నది.

ఇతను వ్రాసినది సామాన్యమానవుల జీవితచరిత్ర లైనప్పటికిని, నిజాని కవి వారి నేదో ప్రయోజనాపేక్షతో అత్యుక్తిశయోక్త్యలంకారములతో ప్రశంసించే వందిమాగధస్తోత్రములు కావు.

వారి సమకాలస్థుల సందర్భ చరిత్రలన్నీ అందు చక్కగా ప్రతిబింబిత మగుచున్నవి.

ఇదియే చరిత్రలు వ్రాయవలసిన సరియైన పద్ధతి యని ఒకప్పుడు శ్రీ ముట్నూరి కృష్ణరాయగురుపాదులు సెలవిచ్చినట్లు జ్ఞాపకము.

ఇతని భాషాశైలి జిగురూ రుచి లేని పాడిమరబియ్యపుపిండి వచన శైలిగాక, మనోహరమైన 'నవల' కావ్యంగా నడచింది.

ఇట్టి సద్గ్రంథము లింకెన్నియో వ్రాసి ధన్యజీవిగా యీ నిర్మాత చిరకాలము వర్ధిల్లుగాక !

తణుకు }
8-11-'48 }

మిత్రుడు శ్రేయోభిలాషి
చెరుకువాడ వేంకటనరసింహము

---

"మన రైతుపెద్ద" అను పేరున శ్రీ గొట్టిపాటి వేంకటసుబ్బయ్యగారు రచియించిన యీ గ్రంథము నిజముగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి జీవిత చరిత్రము చెప్పుచున్నది. బ్రహ్మయ్యగారేమి గొప్పవాడా? ఆయన జీవిత చరిత్రము వ్రాయుట యెందుకు? అని కొందరనవచ్చును. గొప్పతనమనగా నేమిటి? ఈ గొప్పతనమన్నది యాకాశమువంటిది. భూమికి అంగుళమునుండి యెంతయు నాకాశమే. ఈ యాకాశములో నేమేరయైనను నాకాశమే యైనట్లు ఆ గొప్పతనములో నెంతదైనను గొప్పతనమే. బ్రహ్మయ్యగారు జవహర్లాలువంటివాడనుటలేదు. తక్కిన జిల్లాలన్నియు కలిపితే యీయన గొప్పవాడని మేమనుటలేదు. మా జిల్లాలో నాయన గొప్పవాడు కాడని యెవ్వరూ ననలేరు. ఇది యొక గొప్పయా యందురేమో? ఇదియే నిజమైన గొప్పదనము. ఇట్టి బ్రహ్మయ్యగార్లు కొన్ని లక్షలమంది యీ దేశమందుండుటవలననే, నేటి భారతజాతి స్వతంత్రమైనది. ఒక జవహర్లాలు మాత్రమైనాడు. జవహర్లాలును మాత్రమైనది బ్రహ్మయ్యగారివలన. బ్రహ్మయ్యగారొక వ్యక్తికాదు. ఆయన యొక చిహ్నము. మహాత్ముడు స్వాతంత్ర్యశంఖారావమును పూరించినపుడు మేల్కొన్న భారత స్వాతంత్ర్యాభిలాషకు నాయన యొక చిహ్నము.

రాజ్యములు పోవుట వచ్చుట, యుద్ధములు జరుగుట, గెలుచుట వీనిని గురించి వ్రాయబడినది చరిత్ర కానేకాదు. ప్రపంచక సంతతియు నొక పెద్ద మహావిషయముగా కనిపించినను మానవస్వభావమంతయు నొకటియగుటచే నేకదేశగత మైనది. సర్వధాత్రీగతమైనదానికంటె భిన్నము కాదు. ఈ కృష్ణా జిల్లాలో గడచిన ముప్పదియైదేండ్లనుండియు నెట్టి రాజకీయ వాతావరణ పోట్లు జరిగినదో సర్వభారతదేశమంతయును కించిద్భేదములతో నట్లే జరిగినది. నిజమైన కాంగ్రెసుచరిత్ర యనిగాని సురేంద్రనాథ్ బెనర్జీలయొక్కయు, కాంగ్రెస్ మహాసభలయొక్కయు చరిత్ర కాదు. ఆ చరిత్ర రాజకీయములయొక్క పరిణామకథ. ఇది కాంగ్రెసుజీవితము ప్రాణకథ.

ఈ గ్రంథము వట్టి బ్రహ్మయ్యగారి జీవితము కాదు. ఒక పురుషుని జీవితమనగా నేమి? నేయుమనినో వెలసి వ్యవహరించుట అనేక కార్యములలో తాను సనిష్టించుట. వ్యక్తి జీవితము వ్రాయునప్పుడు ఆ నేయుచుండి జీవితము తీసివేయ గూడదు. ఆ యనేక కార్యముల ప్రసక్తియు దీనియం దుండవలెను. అట్లగుటచే నా వ్యక్తియొక్క జీవితచరిత్ర తత్కాలీనమైన తత్కాలసంబంధమైన యథార్థమైన సూక్ష్మవిషయములనుగూడ వివరించునట్టి చరిత్ర యన్నమాట. ఇట్టి గ్రంథములు వందలు వేలు వెలసినప్పుడుగాని మన జాతి నిజమైన యౌన్నత్యము పొందదు.

నేను చిన్నప్పటినుండి బందరుగ్రామవాసిని. ఘంటసాలకు నాకును కొంత హృదయసంబంధమైన బంధుత్వము గలదు. బ్రహ్మయ్యగారు నాకంటె కొన్నియేండ్లు చిన్నవాడు. అందుచేత నీ గ్రంథములో నాయనను గురించి చెప్పిన విషయములు నా కనుభవములో నున్నవి. ఈ గ్రంథము చదువుచున్నప్పుడు నాకు నిజముగా గడచిన యీ నలుబది యేండ్లు మరల బ్రతికినట్లే యున్నది.

ఈ గ్రంథము వాడుకభాషలో వ్రాయబడినది. గ్రంథకర్త వట్టి పత్రికలలోని తెలుగుమాత్రమే వచ్చినవాడు కాడు. ప్రతి పీఠికయొక్క యాద్యంతములు మహాకవుల గ్రంథములనుండి పద్యముల నుదాహరించెను. భారతము, కృష్ణకర్ణామృతము, మనుచరిత్రము, మొదలైన పూర్వగ్రంథములేగాక దువ్వూరి రామిరెడ్డిగారు, చిరుమామిళ్ళ శాగసాస్త్రిగారు, బుచ్చి సుందరరామశాస్త్రి గారు, రాయప్రోలువారు మొదలైన యాధునిక కవులతో గూడ వారికి

చక్కని పరిచయముగలదు. ఉదాహరించిన పద్యభాగములయొక్క యౌచిత్యము వారి పాండిత్యమును మేధాసంపత్తిని తెలుపుచున్నది. పిదప ఘంటసాల. ఘంటసాల పూర్వౌన్నత్యమునుగురించి వారు వేరే యొక గ్రంథమును వ్రాసిరి. ఆ గ్రామము పూర్వమెంత గొప్పదో నేడు నంతగొప్పది. కత్తిలేని ఖద్దరు యావద్భారతములో నెక్కడ దొరకును? ఘంటసాలలోనే దొరకును. సన్నిక కల ఖద్దరు రెండుచోట్లనే దొరకును. మొదటిది ఘంటసాల. రెండవది పెద్దాపురము. పెద్దాపురము ఖద్దరు ముతుక. ఘంటసాల ఖద్దరు సుకుమారమైనది. ఘంటసాలకీ ప్రతిష్ఠ దేనికివచ్చినది? ఒకటి ఘంటసాలలో పూర్వసంప్రదాయములు చావలేదు. రెండవది బ్రహ్మయ్యగారును, వారి గురువులును శిష్యులును ఆ గ్రామమున నడిపిన రాజపద్ధతి. ఆ పద్ధతి గ్రంథమంతయు చదివిననే తెలియును. ఘోటక ఘోషముల విషయములలో కాని గుండేరు గంజి కాలవలకు చట్టాలు వేయించుటలో కాని కాంగ్రెసు ఓటు వేయించవలదనగా నున్నా ఓట్లతో వెళ్ళిన పెట్టెలలో గాని బ్రహ్మయ్యగారి ప్రతిభయే గోచరించుచున్నది. తాలూకా బోర్డు ప్రెసిడెంటుగా నుండియాంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా నుండి బ్రహ్మయ్యగారు చూపించిన నిజాయితీతనము వారు చూపించిన కార్యదీక్షత నేడు పొనుగువడదిగాని నాడు దేదీప్యమానముగా నుండుట నే నెరుగుదును. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శిగా నున్నప్పుడు నేడు బరంపురంలో శే పసంతపురంలో నీరీతిగా నాయన యుండి యెన్నియో చక్కని తీర్పులు చేసెనని నేను విన్నదే సాక్ష్యము. గ్రంథములో వ్రాయబడ్డదియు నదియే. ఈ గ్రంథములో నీ జిల్లాలోని సర్వజనులకు ప్రియులైనవారు, గౌరవనీయులైన వారు పట్టాభి, కృష్ణారావు, చెరుకువాడ, సూరయ్యగారు, చలపతియ్యగారు, కొండాలివారు, అందరును కనులకు కట్టినట్లు కనిపించుచున్నారు. ఒక్కొక్క ఘట్టము చదువుచుండగా నాడది చూచినట్లే యున్నది. చూచుచున్నట్లే యున్నది.

ఇంత చక్కటి గ్రంథము శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు వ్రాసి దేశమునకు ప్రసాదించినందుకు వారికి కృతజ్ఞులమై యుండవలెను. దేశములో ప్రతిగ్రామము ఘంటసాలవలె నుండవలదా? ప్రతివ్యక్తియు వెంకటసుబ్బయ్యగారివలె తమ గ్రామము తమ గ్రామ పెద్దలను గూర్చి వ్రాయవలదా?

ఈ దేశమున నది యేమి దౌర్భాగ్యమో! తెలుగువాడు తనకు తెలుగు

భాష రాదనుకొనును. తెలుగువానికి తెలుగు రాకపోవుటయేమి ? నాకు తెలుగువచ్చు ననుకొనకపోవుటయే దోషము.

ఈ గ్రంథ మింకొకరీతిగా గూడ గుణవంతమయి యున్నది. శ్రీ కృష్ణారావు పంతులుగారి సంపాదకీయము లానాడు భారత రామాయణములకంటె దేశమున కధిక ప్రియమయినవి. ఆ కృష్ణారావుగారు మహాప్రతిభాశాలియని జగద్విదితము. ఆయనయే మెచ్చుకొన్నాడు బ్రహ్మయ్యగారిని.

ఆ సందర్భములైన సంపాదకీయము లిందు సందర్భానుసారముగా పొందుపరుపబడినవి. దానివలన రెండు గొప్పవిషయములు జరిగినవి. బ్రహ్మయ్యగారి ప్రతిభ తెలియుచున్నది. కృష్ణారావుపంతులుగారి సంపాదకీయ రచనా మహాగుణముకూడ పాఠకులకు నిలిచియున్నది. ఇట్లనేకములైన గుణము లీ గ్రంథమునందు పొందుపరుపబడినవి. ఇట్లింత వ్రాసినను వ్రాయవచ్చును. గాని ప్రధానమయిన యొకటి రెండు విషయములు మాత్రమే చెప్పి విడిచెదను. ఈ గ్రంథకర్తయొక్క మేధాసంపత్తి యూహాశాలిత్వమునకు రెండుదాహరణములు చెప్పెదను. బ్రహ్మయ్యగారు విద్యాధికుడు కాదు. ఆయన యింగ్లీషులో పెద్ద పరీక్షల నిచ్చినచో నే నౌకరియో చేసెడివాడు. చదువలేదు గనుక దేశనాయకుడైనాడు అని గ్రంథకర్త వ్రాసెను. ఈ యింగ్లీషు చదువు బ్రిటిషువారి యొక్క నౌకరులను తయారుచేసినది అన్న యథార్థమును వీరు వ్రాయుటయే గాక నిజమయిన ప్రతిభ చదువులో లేదోయి యనిగూడ చెప్పుచున్నారు.

మరియొకచోట 'జాతీయత యున్నప్పుడే యంతర్జాతీయతగలదు. జాతీయతలేకుండ యంతర్జాతీయత లేదు' అని వ్రాసినారు. ఈ సందర్భంలో చాల పండితుల మనుకొనువారే పొరపడుచుందురు. నేనున్నచో నీలోక మున్నది. నేను లేనిచో లేదు. ఈ విషయమునే యిది చెప్పుచున్నది. ఈరీతిగా నీ గ్రంథకర్త గొప్ప వివేకి. విషయములయొక్క యథార్థస్వరూపము తెలిసినవాడు. ఇట్టి మేధాశాలి, దేశాభిమాని, గ్రామాభిమాని, బంధువు బ్రహ్మయ్యగారి జీవితచరిత్ర వ్రాయుట వారి యదృష్టము. దేశముయొక్క యదృష్టము. ఇట్టి గ్రంథము లనంతములు బయలు వెడలునుగాక. పరుల కుపకారకము కాని యాత్మశ్లాఘామానము వృద్ధిపొందుగాక.

విశ్వనాథ సత్యనారాయణ
15—11—48

# విన్నపం



"Princes and lords may flourish or may fade
A breath can make them, as a breath has made
But bold peasantry, their country's pride
When once destroyed, can never be supplied"

—Goldsmith.

"రాజులు, ప్రభువులు—వుండవచ్చును, వూడిపోవచ్చును. ఒకక్షణంలో మళ్ళీ వుద్భవిస్తారు. కాని ప్రతిదేశము తన రైతాంగమును చూచుకొని గర్విస్తుంది. ఆ రైతాంగము నశించిన, అది పరిహారములేని నష్టము."

—గోల్డుస్మిత్

నేడు నాయకులనుగురించి ఆ నేతలు చరిత్రలు వ్రాస్తున్నారు గాని అవి చెప్పుకోదగిన చరిత్రలుగా లేవు.

చరిత్రరచయితలు ప్రత్యేకించి కృషిచేయు కుతూహలము గలవారు లేకపోవుటే కారణము. అందుచేతనే "ఉత్తమ జీవితచరిత్ర రచన, ఉత్తమ జీవితమువలె అరుదు" అన్నాడు కార్లయిలు.

ఇంతకు తానెవరిచరిత్ర వ్రాయదలచాడో ఆయనకు రచయితకు అధిక సంబంధ ముండాలి. * గ్రంథరచనకు అర్హత, అభిరుచి వుండాలి. అప్పుడా గ్రంథము అధికంగా రాణించగలదు.

గొట్టిపాటి బ్రహ్మయ్యగారి చరిత్ర, నేను వ్రాయదలచాను. నేను ఆయనకు సన్నిహితుడను, సహచరుడను, స్నేహితుడను, ఆబాల్యమిత్రుడను.

---

* "Those only who live with a man can write his life, with genuine exactness and discrimination". —Johnson.

ఎరుగనివారినిగురించి ఇతరులమీద ఆధారపడి వ్రాయుటకంటె ఎరిగిన వారినిగురించి యథార్థము వ్రాయుట ఉచితముగదా !

ఇక బ్రహ్మయ్యగారి విషయమై—నాకు సహజంగా ఆయనయందు అభిమానమే. కాని ఆయనయం దున్న రైతు బ్రహ్మయ్యయెడలనే నాకు మక్కువ యెక్కువ. నేను, నాచే రచింపబడిన 'ఆచార్యరంగా'కు ఆయనను పరిచయం వ్రాయుమని కోరుటలో ఒక ప్రత్యేకకారణం లేకపోలేదు.

ఆయన లోకజ్ఞుడని, సరసుడని, కాంగ్రెసుభక్తుడే గాక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘములో వున్నతశిఖరా లందుకున్న ప్రముఖుడనీ, నాకు మిత్రుడనీ కాదు.

జమీందారీ రైతువుద్యమంలోను, రైతువుద్యమంలోను ఆయన అనుభవంగల రైతునాయకుడు. ఆచార్యరంగాగారితో రైతువుద్యమంలో కలిసి పనిచేసి ఆయన ఆశీస్సులు అభినందనలు పొందిన ప్రముఖుడు. ఆయన రైతుబిడ్డేకాక, రైతు. నేను పరిచయం వ్రాయించుటలో కారణము ఇవి.

బ్రహ్మయ్యగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వాదులలో ఒక ప్రత్యేకత గాంచిన ప్రముఖుడు. ఆయన పెద్దలలో పిన్న, పిన్నలలో పెద్ద. ఇంతే కాదు. పెద్దల నెమ్మది, పిన్నల భావోద్వేగము, ఆయనలో సమ్మిళితమైంది ఆయనను పెద్దగా జేసినవి.

కాంగ్రెసువారిలో ఆయన వారధిగా వుండి, కాంగ్రెసు పెంపుకై, పెక్కువిధాల గత ముప్పదిసంవత్సరాలనుండి విశ్రమించనలేకుండా కృషిచేసిన కృషీవలుడు.

ఆయన చేసిన ప్రతికార్యము తాను కర్షకుడననే భావంతోనే చేశాడు. ఇంతే గాదు. ఆయన పొందిన ప్రతిగౌరవము కర్షకలోకానిదిగానే భావించాడు. ఇతరులచేతకూడా, ఆయన కర్షకలోక ప్రతినిధిగానే పరిగణింపబడ్డాడు. ఆయనది కర్షకదృష్టి.

ఈనాడు మన కరువుగా కానవచ్చే గ్రామపెద్దల మర్యాద, మన్నన, నిజాయితీ, మాటలనేర్పు, పరిహాసశీలత, కార్యదీక్ష, కష్టసహిష్ణుత, నిరాడంబరత, లోకానుభవం, పరశ్రేయోభిలాష మన బ్రహ్మయ్యగారిలో బహుగా వున్నవి.

మన పల్లెలలో కుల మత విచక్షణ లేక, వావివరుసతో పిలుచుకొనే పూర్వ సంప్రదాయాన్నే ఆయన పాటిస్తాడు. పాటించుటే కాదు. దానిని ఇతరులుకూడ పాటించేటట్లు చెప్పకుండా చేయగల చతురుడు. అందుచేతనే కాంగ్రెసు గోత్రులైన కళా వెంకట్రావు, నీలం సంజీవరెడ్డి, మూల్పూరి రంగయ్య, మరుపిళ్ళ అప్పలస్వామిపాత్రుడు (చిట్టి)గార్లు మొదలగు ప్రముఖులు అన్నగారని ఆయనను ఆప్యాయంగా పిలుస్తారు. ఈసంప్రదాయాన్ననుసరించే బెజవాడ గోపాలరెడ్డిగారు ఆయనను స్వంతసోదరుడుగా భావిస్తాడు.

నేడు నవనాగరికత ప్రభావంచేత బంధుప్రేమ, హృదయైక్యత నశించి పోతున్నదని ఆయన అధికంగా విచారిస్తాడు.

కర్షకుని కలుపుగోలుతనం, హృదయం, ఆధునిక సభ్యతయెడల అయిష్టం, ప్రకృతికి సామీప్యంగా వుండాలనే గాఢాభిలాష ఆయనలో అధికంగా వున్నవి.

ఈ కారణా లన్నింటిని పురస్కరించుకొని, ఆయనను మనము మన రైతు పెద్దగా భావించవచ్చును.

అట్టి మన రైతుపెద్దచరిత్ర వ్రాయుట రైతులోకమునందు నాకు గల ఆదరాభిమానములే.

మనలను మనం గౌరవించుకొనకపోయినయెడల, మనం ఇతరులచే గౌరవింపబడగలమా? ఇంతే కాదు. మన కర్షకోద్యమవిధాత ఆచార్యరంగా గారి బోధ యేమిటో తెలియునా?

"మిమ్ములను మీరు గౌరవించుకొనుట మొట్టమొదట మీరు నేర్చుకొంటే, యితరులను మీరు గౌరవించగలరు."

కనుక మన రైతు పెద్దచరిత్ర అవసరము కాదా?

"ప్రతిభావంతుల ప్రతిభ, వారి ప్రత్యేకగుణం _ వారి లోపములు మాత్రమే మనకు వారికి సామాన్యములు" అని శ్రీ వివేకానందుల నిర్వచనము_ అనగా ప్రతిభాశాలుర లోపములు ఎన్ని అవి మనకు వున్నవని నీచసంతోషాన్ని అనుభవించేవారిని మందలిస్తూ, వారి దుర్గుణాలనుగాక వారి ప్రతిభను పూజింపవలసిన అవశ్యకతను చూపిస్తూ ఆయన ప్రబోధించాడు. అది గమనించుట అవసరం.

"మీరు సుహృద్భావం ప్రకటించకపోతే యెదుటవాని వ్యక్తిత్వము సూచించిన పుస్తకంవలె మీ కేమీ గోచరం కాదు" అంటాడు మన ప్రథమ భారతీయ గవర్నరు జనరల్ రాజాజీ.

కనుక పాఠకులు సుహృద్భావం ప్రకటించకపోతే నాశ్రమ నిరర్థకం.

బ్రహ్మయ్యగారికి స్నేహితుడను, సహచరుడను అయినంత మాత్రాన ఆయనను నిరూపించగలిగానని చెప్పలేను.

నేనే కాదు, యెవరూకూడా ఒక వ్యక్తినిగురించి యిదమిత్థమని నిరూపించుట సాధ్యముకానిపని. ఇతరులే గాదు. ఎవరికివారే తమ స్వరూపము నంతనూ సరిగ విషయానుభవము చేసుకొనజాలరు. ఇక యిది యితరులకు సాధ్యమని యెవ రనగలరు ?

అయినను వారికి తెలిసినంతవరకు, తెలుపగోరువారు చరిత్రకారులు. వారిచ్చే లిఖింపబడిన చిత్తరువు వారి బింబమును సమగ్రముగ ప్రతిఫలింపలేక పోయినా, వారి చరిత్ర పరిచయమునకు కొంతసాధన కాగలదనుట నిశ్చయము.

అట్టిదే నాకృషి; అంతకంటె అధికంగా భావించవద్దనే నా మనవి.

నా చరిత్రరచనకు నా శక్తిసామర్థ్యములు గాదు, నా వీరారాధన తత్పరతయే కారణము.

వీరు అంటే కత్తిపట్టి కదనరంగమున కలిగినవారే గాదు. దేశకళ్యాణానికై కృషియొనర్చినవా రంతా వీరులే.

స్వార్థత్యాగులై లోకాన్ని వున్నతపథములో నుంచుటకు విరామములేక వీరులు కృషిసల్పెదరు. వారి కార్యకలాపాలు సర్వశ్రేయోముఖములై యుండును. అందుచేతనే వారు మనకు మార్గదర్శకులు.

ప్రతి వ్యక్తిలోను మంచిచెడ్డ లుండును. వారిలో మంచి అధికంగా నుండుటచేతనే అనుకరణీయు లగుచున్నారు.

అందుచేత వారిచరిత్రల ఆవశ్యకత మనకు అధికంగా కలదు.

ఇంతే కాదు. వీరపూజ దేశోన్నత్యానికి, జాతిమహాత్మ్యానికి ఆవశ్యకమైన పవిత్రానుష్ఠానము. అందుచేతనే జాతి తన వీరుల ఆరాధనవలననే జీవించగలదని నానుడి పుట్టినది.

అట్టి వీరారాధనకు వారిచరిత్ర రచనకంటె అధికమైన దేది కలదు ? అట్టి కార్యాన్ని శక్తివంచనలేకుండా క్రమబద్ధంగా చేయటానికే నేను కంకణం కట్టుకున్నానని వినీతుడనై విన్నవించుకొనుచున్నాను.

ఈ గ్రంథరచనలో కృష్ణాపత్రిక అధికంగా ఉపకరించింది. అందుకు అధికకృతజ్ఞుడను. కృష్ణాపత్రికా సంపాదకీయాలు ఇందులో చాలా ఉపయోగించాను. కృష్ణరావుగారికి బ్రహ్మయ్యగారిపైగల ప్రేమకు ఈ సంపాదకీయాలు సాక్ష్యాలని అనుకోవచ్చును.

అంతకంటె సత్యమునందు పంతులువారికి గల గాఢాభిమాన మనుకొనుట సముచితము కాదా ?

ఆంధ్రప్రభ సంపాదకులగు నార్ల వెంకటేశ్వరావుగారు పీఠిక వ్రాసి ఈ కృతికి శోభతెచ్చినందుకు నా నమోవాకములు.

ఘంటసాల
8—11—48

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

# విన్నపము

అరుమాసాలలోనే ప్రతులన్నీ అయిపోయినవి. అందు చేత ద్వితీయముద్రణపు అవశ్యకత కలిగింది.

ఈ ముద్రణలో కొద్దిమార్పులు చేయబడి అనుబంధము చేర్చబడింది.

మనరైతుపెద్ద, పెద్దలకు చిన్నలకు, సమాదరణీయమైనట్లే, ఈ 'మనరైతుపెద్ద' కూడ అటులనే ఆదరణీయమగుట అదృష్టంగా భావిస్తున్నాను.

ఈ కూర్పుకు కూలంకషముగు పీఠికవ్రాసిన శ్రీ పింగళి లక్ష్మీకాంతం పంతులుగారికి కృతజ్ఞతా పూర్వక వందనము లర్పిస్తున్నాను.

ఘంటసాల }
19–4–'49 } గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

# ఇతర రచనలు

1. గాంధి మహాత్ముని నిర్బంధము (అనువాదము)
2. గీతాభూమిక ( ,, )
3. నవ్వులు - పువ్వులు (సంకలనము)
4. భట్టుమూర్తి, రామరాజభూషణుడా ?
5. మన జమిందారీలు
6. హంపీ పిలుపు
7. ఘంటసాల చరిత్ర
8. ప్రజానాయకుడు ప్రకాశం
9. ఆచార్య రంగా
10. సరోజినీ దేవి

# విషయసూచిక


| | | | పుట సంఖ్య |
|---|---|---|---|
| 1. | పరిచయం | ... | 1 |
| 2. | వంశవృత్తాంతము | ... | 10 |
| 3. | విద్యాభ్యాసము | ... | 17 |
| 4. | ఇంటగెల్చి రచ్చగెలుచుట | ... | 21 |
| 5. | గ్రామసేవ | ... | 36 |
| 6. | ఎన్నికదావా | ... | 44 |
| 7. | తాలూకాబోర్డు అధ్యక్షత | ... | 49 |
| 8. | నల్లజెండాలు | ... | 55 |
| 9. | రైతుఉద్యమము | ... | 68 |
| 10. | జమీందారీ రైతుఉద్యమము | ... | 69 |
| 11. | అసెంబ్లీఅభ్యర్థిత్వము | ... | 78 |
| 12. | ఆంధ్రరాష్ట్రీయమహాసభ - అధ్యక్షత | ... | 91 |
| 13. | రాష్ట్రకార్యదర్శి | ... | 96 |
| 14. | జిల్లాబోర్డువ్యవహారాలు | ... | 102 |
| 15. | కౌన్సిల్ ఎన్నికల విద్రోహం | ... | 123 |
| 16. | అసెంబ్లీ అభ్యర్థిత్వపు అలజడి | ... | 129 |
| 17. | జైలుజీవితము | ... | 140 |
| 18. | కుటుంబజీవితము | ... | 149 |
| 19. | ప్రోత్సాహకులు | ... | 146 |
| 20. | గురువులు | ... | 165 |

21. ఆయన విశిష్టత
22. ఆయన ఆధిక్యం
23. స్వభావము
24. జీవితలక్ష్యం
25. ఉపసంహారం
26. అనుబంధము



మన రైతు పెద్ద

# పరిచయం

"మనమింతవరకు, పల్లీయులసంగతి పరికించనే లేదు. భోజనానికై మనము వారిపై ఆధారపడియుండి కూడ ఇంత వరకు, మనమే, వారికి ఆశ్రయదాతలమని, వారు ఆశ్రితులని అనుకున్నాము! వారి అవసరాలను మనము ఆలోచించనే లేదు" బాపూ.

ఒకవ్యక్తి జన్మవల్ల ఒక గ్రామానికి ఖ్యాతిరావడం కద్దు. అట్లాగే ఒక గ్రామములో జన్మించుట చేత ఆ వ్యక్తికి జన్మస్థాన విశేషంవల్ల కీర్తి ప్రతిష్ఠలు త్వరగా, రావడానికి దోహదం కావచ్చు.

ఒక ప్రసిద్ధ స్థలములో ఒక ప్రఖ్యాతపురుషుడు పుట్టడంటే, పరస్పర సంబంధాలవల్ల, వ్యక్తి స్థలాలకు మరింత గౌరవ ప్రపత్తులు కల్గడంలో ఆశ్చర్యమేమున్నది?

అట్లాగే ఒక ప్రఖ్యాతవంశాన జన్మించిన కారణాన జనానురాగం కల్గటం కద్దు. ఆ పూర్వపురుషుల కీర్తి ప్రతిష్ఠలు ఆ వ్యక్తిలో అవతరించి అభివృద్ధికి తీసుకొని రావడం కూడా సహజమే.

అట్టి అనుకూల వాతావరణమే, మన బ్రహ్మయ్యగారికి తోడ్పడింది,

అనేక శతాబ్దాలక్రితం, బౌద్ధులకు పుణ్యప్రదమైన కేంద్రస్థలమై, బుద్ధభగవానుని దివ్యబోధలను, దేశదేశాంతరములకు తీసుకొనిపోయి జ్ఞానజ్యోతులు వెలిగించిన నిలయమై, వాణిజ్య కేంద్రమై, రోము మొదలగు విదేశాలనుండి స్వర్ణ

కాసులను మాతృభూమికి జేర్చిన సాహసాత్రయోధుడు, ప్రతిక చెడ్డ ఆంధ్రుల ప్రాక్తన వైభవ సాహసజీవితములను కేంద్రమై శిలలకు ప్రాణప్రతిష్ఠ చేయుచున్న ఆంధ్ర శిల్పకళాలయమై విలసిల్లిన చరిత్ర ప్రసిద్ధమైన ఘంటశాల గ్రామమాయన జన్మస్థానము.

ఆయన గ్రామమువలె వంశము పూర్వప్రతిష్ఠగలది. ఆయన తాత సైనికుడై స్వయంశక్తి సామర్థ్యములచే సుబేదారు పదవి పొంది, ఆత్మగౌరవము, అభిమానముగల శక్తి పూజా దురంధరుడగు సత్యవాది.

ఆయనతండ్రి విద్యావినయ సంపన్నుడై గ్రామాభివృద్ధికై కృషి యొనర్చి, ప్రజాసేవలో ప్రఖ్యాతి గాంచిన కార్యవాది.

ఆయన పినతండ్రి పట్టభద్రుడై, ఉన్నత ప్రతిష్ఠ పొందిన న్యాయవాది.

ఇక మన బ్రహ్మయ్యగారో జగమెరిగినవారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసులో ఉన్నతపదవుల ద్వారా సేవచేసిన ప్రఖ్యాత కాంగ్రెసువాది.

చూడగానే ఆకర్షింపబడును. ఆజానుబాహువు. ఆరడుగుల నిడివేకాదు. నిండైన విగ్రహం. ప్రసన్నవదనం. స్ఫురద్రూపి. ఆ ఆకారానికి తగినట్లు బిళ్లంచు • గల తెల్లని ధోవతి, జారుగోచి బారు లాల్చీ. దానిపైన గోరంచుగల ఉత్తరీయమును కప్పును. ఆ వున్నత ఆకారమునకు ఉజ్వ

• ఒక తాటాకు వెడల్పుగల ఎర్రంచు 'దీనికి బ్రహ్మయ్యగారంచు' అని ప్రతీతి.

లముకల్గించే, వస్త్రాలంకారము పుట్టుకతోనే పెద్దవాడుగా పుట్టినట్లు చూపరులకు తోచును.

ఒక్క ఆకారమువల్లనే కాదు, ఆయన పెద్ద, గుణ గణాలు శక్తి సామర్థ్యాలు కూడా, ఆయనను పెద్దగా జేసినవి.

ఆయన యెంత ఉన్నతాకారుడో, హృదయమంత విశాలమైనది. మేధస్సు అంత నిశితమైనది. వర్తన అంత విమలమైనది.

ఒక వ్యక్తిని గుర్తించాలంటే, ఆయన గురువులను ముందు గుర్తించాలి. ఆంధ్రదేశములో అధిక ప్రఖ్యాతి గాంచిన, త్రిమూర్తులగు, కృష్ణరావు, పట్టాభి, నరసింహాం గార్లాయన గురువులు. గురువుల గుణగుణాలాయనలో గుమి గూడినవి. కృష్ణరావుగారి విమలవర్తనము, పట్టాభిగారి ప్రతిభ, నరసింహాంగారి సేవానురక్తి ఆయనలో చెన్నారిన వని చెప్పనక్కరలేదు. పరిచయులకు.

ఆయన ఒక విశిష్ట వ్యక్తి. పురోగామి గానటంతో పాటు ఆయనలో కొంచెం పూర్వాచార వాసన లేకపోలేదు. సంస్కరణాభిలాషి కావడంతో బాటు, సంప్రదాయ బద్ధుడు. ఉత్సాహపరులతో పరుగెత్తడు. లాభనష్టాలు గణించే వారితో చతికిలబడడు.

ఆయన పండితుడు గాదు. విద్యావంతుడును గాదు. గ్రంథపఠనాభిలాషియు కాదు. అధిక లోకజ్ఞానం, పరేంగిత బుద్ధి ఉన్నందున, ఆ సంస్కారలోపం యెంతమాత్రం కన్పించదు.

ఆయన అధిక సంచారం చేయకపోయినా పెద్దల సాహచర్యం; సంపన్నమైన భావశబలత వున్నందున, ఏ లోపంకూడా ఆయనను బాధించదు.

గ్రంథాలేమీ ఆయన వ్రాయలేదుగాని; వ్రాసినది కాస్తా చక్కగా వ్రాయగలడు. శైలిసరళమై, భాష సహజమై, తెనుగునుడికారము గలిగి వుంటుంది.

వక్తగా ఆయనను పరిగణింప వీలులేదుగాని, ఉపన్యాసాలలో హృదయధారవుంటుంది. వాక్యాలు చిన్న చిన్నవిగా వుండి, సామెతలు, ఆమెతలు, కథలు, గాథలు స్వానుభవములుగలిగి తెలుగు నుడికారముతో, అచ్చమైన తెలుగుమాటలతో రాణించగలదు. విషయాన్ని విడచి శాఖాసంక్రమణ చేయడు. శబ్దాడంబరము లేక, శ్రోతలకర్థమయ్యేటట్లు గాక, చెప్పినది శ్రోత చెవియొగ్గి వినేటట్లు చెప్పగలడు.

వాదనలో చతురుడు. ప్రతివాదిపైగాక, ప్రతివాదము మీదనే స్వీయ ప్రాగల్భ్యమును ప్రదర్శించుటలో దిట్ట.

సంభాషణలో సరసుడు. వస్తుతః ఆయన మంచి మాటకారి. చమత్కారి, సంభాషణలోనే ఆయన అసలు హృదయం వెల్లడయ్యేది. ఆయనదేకాదు యెవ్వరిదైనా అంతే. సంభాషణలో ఆయన విశాలహృదయం, ఆప్యాయత అనురాగం, మర్యాద, మన్నన, లోకానుభవం, పరిహాసకుశలత వెల్లడికాగలదు. ఆయన ప్రసంగించే ప్రదేశం ఒకచిన్న సమావేశమౌతుంది.

గొప్ప సాహసవంతుడనలేముగాని తనవ్యూహం తాను వేసుకొని సాధించుటలో సమధిక ప్రతిభావంతుడే.

ఏ సమావేశంలోనైనా ఆయనను అందరు అనుగమించకపోయినా, గమనించక తప్పదు.

ఆయన ప్రచారకుడు కాదు. ప్రబోధకుడు కాదు. నిర్మాణ నిపుణుడు కార్యదక్షుడు.

ఆయనకెట్టి సహజశక్తి కలదో అట్టి జ్ఞాపకశక్తి కలదు. పట్టుదల, చురుకు, చొరవ, సద్యస్ఫురణ, సూక్ష్మదృష్టి, శీఘ్ర నిర్ణయం, కార్యవ్యగ్రత, కార్యదక్షత, ఆత్మవిశ్వాసము, ఆత్మగౌరవము ఆయనలో అధికము. విచక్షణా జ్ఞానములో అధికుడు, నిష్కపటి, నిష్కర్షి, అభిమానియైనా నిగర్వి, నిరాడంబరుడు.

ఆయనలో ఆవేశంకంటె ఆలోచన అధికం. అందుచేత, ఆయన అంతరిక్షాన సంచరించే ఆదర్శవాదికాదు, నేలమీద నడిచే లోకజ్ఞుడు. వాస్తవికవాది, ఆచరించగలినదే ఆయన ఆకాంక్షించును. అందుచేత ఆయన లక్ష్యాలు పరిమితమైనా, వాటిసాధనలో ఆయన చూపే ప్రజ్ఞావిశేషాలు అధికం.

లోకాన్ని వడగట్టిన సంస్కారి. ఒక పని చేయదలచుకుంటే లక్ష్యం పూర్తిగా విడనాడడు, నీతి నతిక్రమించడు. ఏవరి మనస్సు నొప్పించడు, తన పట్టును విడువడు. నవ్వుతూనే తన కార్యాన్ని నెగ్గించుకుంటాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన కార్యదక్షుడు.

"ఏవ్యక్తి విలువనైనా, అతడుచాటే సిద్ధాంతాలను బట్టి గాక, అతని కార్యదక్షతను బట్టే నిర్ణయించాలి" అంటాడు, మన ప్రధాని పండిత నెహ్రూ.

కొందరికి ఉన్నత భావాలుండవచ్చు, ఉత్తమ లక్ష్యములుండవచ్చు కాని అలా వున్నవారికి వజ్ర సంకల్పం, కార్యదక్షత వుండు టరుదు. కాని కావలసింది వజ్ర సంకల్పమే కార్యదక్షతే. ఇది మన బ్రహ్మయ్యగారిలో సమధికంగా ఉన్నవి.

ఆయన ప్రత్యర్థులు కూడా, ఆయన దక్షతను ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షముగానైనా అంగీకరించగలరు.

1920 వ సంవత్సరములో కాంగ్రెసు ఓట్లు యివ్వవద్దని ఆజ్ఞాపించింది. ఆ విధంగా అధిక ప్రచార ప్రయత్నాలు జరిగినవి. కాని కాళీ పెట్టెలు యెన్ని పోలింగు స్టేషనునుండి వచ్చినవి? ఒక్క బ్రహ్మయ్యగారి పోలింగు స్టేషనునుండే వచ్చినవి. మద్రాసు రాజధానిలో మరొక చోటునుండి రాలేదను సంగతి గ్రహిస్తే ఆయన కార్యదక్షత నిరతిశయమని తెలుసును.

ఇంతేకాదు కొంతమంది నాయకులు, స్వస్థలాల్లో పరాయివారుగ పరిగణింప బడతారు. ఆయన అట్లా కాదు, ఆయన పలుకుబడి యింటా బయటా సమానమే. స్వగ్రామాన్ని కాంగ్రెసుకు పెట్టని కోటగా చేసి ఆంధ్ర నాయకుల చేత నేగాక మహాత్ముని చేత కూడ మన్నన పొందిన మాననీయుడు. ఇంటగెల్చి రచ్చగెల్చిన విఖ్యాతుడు.

మీర్జాపురంరాజాగారు 1926 వ సం॥లో అసెంబ్లీ అభ్యర్థిగానుండి అన్యాయంగా వోట్లు సంపాదించినందుకు, యెన్నిక దావాలో ఒక పిటీషనరుగావుండి, యెందరో అనుకూలురు, ప్రతికూలురైనా, రాజాగారెన్ని ప్రలోభములు కల్గించినా, తుదివరకుపోరాడి నీతికినిలబడి, ఖ్యాతిగాంచిన నిర్మల చరితుడు.

ప్లీడర్లకు పీఠమైన బందరు తాలూకాబోర్డుకు 1927 సం॥లో అధ్యక్షస్థానమునహించిన రైతు.

ఆయన చేత వారూవీరూ ఆపని యీపని, దారిదప్పి చేయించకలిగారా? నడతలోనే సూటిమార్గంగల మనః రైతుపెద్ద, సూటిపనులనే చేయగలడు.

యింతేగాదు. జస్టిసుపార్టీ తనకు ప్రతిపక్షంగావున్నా సామరస్యంగా నడిపిన దక్షుడు.

వ్యవహారమంతా తెలుగున నడిపించిన మాతృభాషాభిమాని.

పాఠశాలలలో నైతికబోధ యేర్పరచిన నీతివంతుడు.

హరిజనోపాధ్యాయులను ప్రథమంగా పల్లెల్లో వేసి, అస్పృశ్యతా నివారణకు దోహదమిచ్చిన సంస్కర్త.

ఉద్యోగులచేతను, ఉపాధ్యాయులచేతను ఖద్దరు వస్త్రధారణ చేయించి, కాంగ్రెసుబోర్డుగా జేసిన దేశాభిమాని.

సైమన్‌సప్తకము మన సరిహద్దులలో సంచరించుటకు వచ్చినప్పుడు, బహిష్కారసూచకముగా బడులను మూసి, ఆఫీసుపై నల్లజెండా ప్రతిష్ఠించిన ధీరుడు.

ఉద్యోగులను, ఉపాధ్యాయులను సోదరులుగా జూచిన ఉదారుడు. అందుచేతనే నేటికిని వారు ఆయనను మా ప్రెసిడెంటుగారని ఆప్యాయంగా పిల్చుకుంటారు.

పరిపాలనను దక్షతతోనడపి, ఆదర్శవంతమైనబోర్డుగా జేసిన ప్రతిభాశాలి.

1930 సంవత్సరములో బందరుకు గవర్నరు వచ్చినప్పుడు మీా పరిపాలన ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా

వృద్ధుడని నల్లజెండాలుజూపిన తూర్పుకృష్ణా కాంగ్రెసు అధ్యక్షుడు. ఆనాటి వారికార్యక్రమములవలె ఆంధ్రదేశములో యెచ్చటను అంత దిగ్విజయముగా జరగలేదు, అని ప్రసిద్ధ నాన్ని పెద్దలు పెక్కువిధాల ప్రశంసించారు.

రైతు వుద్యమములో ఆయన ఆచార్యరంగాకు సహచరుడుగా నుండి, తన రైతు లోకానికి సేవచేసి ప్రస్తుతి గాంచాడు. రీసెటిల్మెంటు వుద్యమంలో కారాగారమున కరిగెను.

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ అధ్యక్షుడుగా నుండిన గారు, తదుద్యమ విజయ సారథులలో నొకరు.

జమీందారీ రైతు వుద్యమ ప్రారంభకులలో ఒక ప్రముఖుడుగా పరిగణింపబడువారు, ప్రజాకంటకుడగు చల్లపల్లి యెస్టేటు దివానును సాగనంపిన రైతు బాంధవుడు.

జమీందారీ రైతు వుద్యమములో మునగాల సంఘటన లోక ప్రసిద్ధము. మునగాల జమీందారుకు రైతులకు కల్గిన వివాదమును పరిష్కార మొనర్చి ఉభయుల మన్నలగాంచిన మనీషి.

ఆంధ్రరాష్ట్రీయ మహాసభ అధ్యక్షపీఠ మెక్కిన, మొదటి రైతుబిడ్డ. ఆ సభను అతి చాకచక్యముగా నడిపి, ప్రముఖుల ప్రశంస లందిన ప్రతిభావంతుడు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా నుండి నేటి గవర్నర్ జనరల్, నాటి ప్రధానియగు రాజాజీచే ప్రశంసాపాత్రుడైన కార్యచతురుడు.

వేయేల? ఆచార్యరంగాగారు అన్నమాట నాలకించుడు.

"కృష్ణారావు, చెరుకువాడ, పట్టాభి, కొండాలి, గొట్టిపాటివారి కలయిక, పంచభూతాలు. ఆంధ్రులకు మొత్తము మీద, వన్నె వెలుగు కలిగించినవనే బహుజనాభిప్రాయము. వారి ఐక్యతవలన ఆంధ్ర తేజము పెరిగింది. విజృంభణ సాధ్యమైనది"•

ఆయన యెన్ని కార్యాలు సాధించినా, యేపని చేస్తున్నా, తాను రైతుననే స్వస్వరూపజ్ఞానము విడనాడక, సదా ఆభావముతోనే సంచరించును

అందుచేతనే ప్రజాసేవతోపాటు, మన జీవనాధారము లగు, నందులవంటి వృషభరాజములను, కామధేనువుల వంటి ధేనువులను పోషిస్తూ, ఆ యెద్దరంకెలను, కోడెల ఆర్భాటములను, ఆవుల అంభారవములను, లేగల గంతులను గాంచి, ఆనందిస్తూ, భూదేవిని భజిస్తూ, పంటపొలాలను ప్రేమిస్తూ, పాలేళ్ల పొందుతో, కూలీల సహవాసంతో, తోటి రైతుల ఆదరముతో, రైతులలో రైతై, గ్రామస్తులలో గ్రామస్తుడుగా వుంటాడు.

"సైరికా, నీవు భారతక్షాత్రతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి! శూరమణివి!
ధారుణీపతి పాలనదండ మెపుడు
నీ హలంబు కన్నను ప్రార్థనీయమగునె?"

కృషీవలుడు.

---

• చిత్రగుప్త 1939.10.15

# వంశవృత్తాంతము

"సమర సమయములందు పితరుల
క్షాత్ర తేజము నిలువబెట్టుము
శాంతిదినముల సేవ్యమగు దే
శమును కాపాడు."

వల్లెపట్టు

బ్రహ్మయ్యగారి వంశములో మనకు తెలిసినది వారి ముత్తాత, గంగయ్యగారి సంగతే. అయనది ఘంటసాలకు 4 మైళ్ళ పడమరలో వున్న చినకళ్ళేపల్లి గ్రామం. గంగయ్య గారికి బ్రహ్మయ్య యేకైక సంతానము. కుమారుని యెనిమి దోయేట తండ్రి మరణించాడు. భర్తవియోగాన్ని, సహించ లేక ఆయనభార్య వీరమ్మ తన తనయుని బాధ్యత భగవంతునిపై వుంచి, నూతిలోబడి మరణించింది.

దిక్కులేని పక్షివలెవున్న బ్రహ్మయ్య భాగవతుల కూచిపూడికి సమీపములోవున్న పెదపూడి గ్రామంలోని మేనత్తగారింటికి, చేరాడు. మూడు సంవత్సరములామేనత్త పోషించింది. ఆమె పేదరాలగుటచేత తనబంధువును, ఘంటశాల కాపురస్తుడు అయిన, అయినపూడి రామన్నగారు వచ్చినప్పుడు, తన అన్నకుమారుని తీసుకొనివెళ్ళి పనిపాటలు చేయించుకుంటూ వృద్ధిలోనికి తీసుకురావలసిందని వప్పగించింది.

ఈ రామన్నగారు, భూవసతిగల వుత్తమ గృహస్థు. ఆకాలంలో వర్షాలు అధికం కావడంచేత పంటలుపండేవి కావు. అందుచేత ఆనాడు పచ్చికరువేగాని యెండుకరువుండేదిగాదు.

భూమి యెంతవున్నా శిస్తుయివ్వలేని స్థితిలో వుండేవాడు రైతు. నాణెములు అధికంగా చెలామణిలేని ఆరోజుల్లో వస్తు మార్పిడే అధికంగావడమువల్ల, పంటలువండినా, కొనే వాళ్ళుండేవారుగారు.

రైళ్ళు రాస్తాలు లేనందున వ్యాపారం హెచ్చుగా వుండేదిగాదు. వున్నకొద్ది వ్యాపారం బండ్లమీద గంతావుల మీదా సాగుతూవుండేది. ఆ కాలంలో భూమికి విలువేలేదు. యకరం రెండు మూడు రూపాయలుండేది. పశువులే ధనం. పంటతక్కువైనా పాడి పుష్కలంగావుండేది. శిస్తులుచెల్లని ఆరోజుల్లో రైతులు ఒక ప్రాంతాన్నుంచి మరొక ప్రాంతానికి కిరాయి తోలుకుని శిస్తు డబ్బులు సంపాదించుకుంటూవుండేవారు. యీకిరాయిబండ్లను తోలడానికే ఆరోజులో "కమాన్ తోలుడు" అనేవారు. యిట్లా కమాను తోలేబండ్లు ముఠాలుగావుండేవి. ముఠాకు 20 లేక 30 బళ్ళు వుండేవి.

యిట్టి ముఠానాయకులలో అయినవూడి రామన్న గారొకరు. ఘంటశాలనుండి జగ్గయ్యపేట, హైదరాబాదు, నాగపూరు, ప్రాంతాలకు కిరాయితోలుతూవుండేవారు. ముఠా నాయకులగు రామన్నగారు బ్రహ్మయ్యను తీసుకొని జగ్గయ్య పేట ప్రాంతాలకు కమాను వెళ్ళాడు. చిన్న చిన్న, పను లన్నీ చిన్నవాడగుటవల్ల యీ కుర్రవాడిచేత చేయించే వాడు. వయస్సున చిన్నవాడైనా, కట్ట గుడ్డ, తిన తిండి లేని పేదవాడైనా, ఆత్మాభిమానంగల బ్రహ్మయ్య యీ పనులు చేయ నిరాకరించెను. అంతట ముఠా మేస్త్రి తనను ధిక్క-

రించినందుకు వీపుపై నాల్గు విసిరాడు. యీ అవమానం సహించలేక, భారం భగవంతునిపై నుంచి బంధుమిత్రులను విడచి బయలుదేరాడు.

కొంతదూరం వెళ్ళి అలసిపోయి దారిప్రక్క నొక చెట్టుక్రింద కూర్చుండెను. ఆ దారే వెళ్ళుచున్న ఒక సైన్యాధికారి యీ కుర్రవానిని చూచుట తటస్థించినది. అప్పటికి బ్రహ్మయ్య 12, లేక 13 యేండ్లవాడు. మంచి అందగాడు. ఆజానుబాహువు. వీరత్వము ముఖాప్రభవించిన ఆ కుర్రవానిపై ఆ యధికారి దృష్టిపడెను. యింతేగాక, పాపము! కొద్దిరోజుల క్రితమే, యిటువంటి కుమారుని పోవుట, ఆయనకు తటస్థించినది. అందుచేత ఆ కుర్రవానిని వెంటబెట్టుకొని, విద్యాబుద్ధులు కలిగించి మిలిటరీ వుద్యోగంలో చేర్చాడు. ఆయన ఆంగ్లదేశం వెళ్ళదలచి వచ్చినప్పుడు తన స్థానే వచ్చిన వుద్యోగికి వప్పజెప్పి వెళ్ళాడు.

తర్వాత, ఆ నూతనోద్యోగి అభిమానమునకు పాత్రుడై యేడు రూపాయలనుండి, యిరవై అయిదురూపాయిల జీతముగల జమాదారయ్యాడు. ఆ సమయములో నే ఘంటశాల వచ్చి, అయినవూడి రామన్నగారి సలహా సంప్రతింపులతో వివాహము జేసుకొని, కొలువుకు వెళ్ళాడు. భార్య అచ్చమ్మ వచ్చిన తరవాత ఆయన అదృష్ట మధికమైనది. వెంటనే యాభై రూపాయిల జీతంగల హవల్దారైనాడు. మరికొంతకాలానికి నూరు రూపాయిల వేతనం గల సుబేదారైనాడు. అప్పటి కాయనకు వీరరాఘవయ్య, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అని యిద్దరు కుమారులు.

వీరరాఘవయ్య తండ్రివలె మంచి భారీమనిషి. దృఢకాయుడు. ఆటపాటలం దధికప్రీతి గలవాడు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామిం స్ఫురద్రూపి, సుకుమారి. చదువు సంధ్యలందు అధికాభిలాషి. వీరి బాల్యావస్థలోనే తల్లి అకస్మాత్తుగా కాలంచేసింది.

అంతట సుబేదారు ఘంటశాలవచ్చి యిల్లువాకిలి యేర్పాటుచేసుకొని, అత్తగారి సంప్రతింపుతో, కాంతమ్మ అనేఆవిడను వివాహమాడి, వారినితీసుకొని తిరిగి పటాలం లోకి వెళ్ళాడు. ఆయన అనేకయుద్ధాలలో పేరోచితంగా పోరాడిన పరాక్రమశాలి.

మన హిందూదేశాన్నుంచి పటాలపు వుద్యోగులను యేర్చి, విక్టోరియారాణిగారి దర్శనానికి పంపినసందర్భములో మద్రాసు రాజధానినుండి పంపబడిన పదునెనిమిది మందిలో ఆయనొకడు. ఆసందర్భములో ఆయన కొక పతకముకూడా బహుమతిచేయబడినది. ఆయన ఆరడుగులపొడవుగల ఆజానుబాహుడు. పొడవుకుతగిన లావుగల్గిన గంభీరమూర్తి.

ఆయన పెన్షను పుచ్చుకునేరోజులు వచ్చినవి. కాని యింకా దారుఢ్యం వుండుటవల్ల, కమేండర్ ప్రాపకంవల్ల వుద్యోగంలో వుండెను. ఆయన పైఅధికారి మేజరుసుబేదారు కొద్దిరోజుల్లో పెన్షను పుచ్చుకోవడానికి సిద్ధంగావున్నాడు. ఆయన పెన్షను పుచ్చుకోగానే ఆస్థానంలో తాను ప్రవేశించిన జీతము 200-0-0 వచ్చుననియు తర్వాత మానుకుంటే నూరు రూపాయిల పెన్షను వస్తుందనే ఆపేక్షతో యింకా వుద్యోగంలోనే వుండెను.

యీయన యిట్లా ఆపేక్షతో వున్నాడు. యీయనక్రింది వుద్యోగియైన హవల్దారుకూడా యీయనస్థానంలోనికి వచ్చి పెన్షను తీసుకుందామనే వుద్దేశంతో వున్నాడు. యీ హవల్దారు అన్న యీ సుబేదారుకు విషప్రయోగము చేయించిన అతను మరణించుననియు, తనతమ్ముడు సుబేదారై పెన్షను తీసుకుంటాడని దురుద్దేశముకలవాడై ఆవిధంగా విషప్రయోగముజేయ ప్రయత్నించెను. సుబేదారీసంగతి గ్రహించాడు. యిదివరకు అగస్మాత్తుగా చనిపోయిన తన ప్రథమభార్యకు కూడా యీవిధంగానే విషప్రయోగం జరిగివుంటుందని భావించాడు. అందుచేత యిక్కడవుండుట తనకు, తనబిడ్డలకు క్షేమంగాదనియెంచి యాస్థానంలో పెన్షనుతోనే ఘంటశాల వచ్చాడు.

వచ్చినవెంటనే భూమిపుట్ర సంపాదించుకొని స్వతంత్ర శేద్యం సాగించాడు. గ్రామంలో యెవ్వరిసాయం సహితము కొనేవాడుకాడు. తన వ్యవహారంలో యెవరుజోక్యంకలుగజేసుకున్నా సహించేవాడు కాదు. ఆయన నిత్యం దేవీపూజ చేస్తూండే వాడు. సత్యదృష్టికల్గి సంచరించేవాడు. అర్థులకు నాస్తి అనకుండా శక్తికొలదీయిచ్చి పంపుతూ వుండేవాడు.

మితభాషి. అనవసర సంభాషణ చేసేవారిని చీవాట్లు పెట్టి పంపేవాడు.

ఆయన రెండవ భార్యకు నల్గురూ ఆడపిల్లలే. ప్రథమ భార్య సంతానమగు వీరరాఘవయ్య, యింగ్లీషు చదువు బాగా చదువక తెలుగు బాగా చదువుకున్నాడు. శాస్త్ర కవిత్వ ధోరణికూడా కల్గింది. హిందూస్థానీకూడా బాగా

మాట్లాడేవాడు. వ్యవసాయమంటే అధిక యిష్టం. కాయ కష్టమునందు గౌరవంగల మనిషి, యీయన తమ్ముడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి బి. యే. వరకు చదివాడు. బహుశా యీ జిల్లాలో ఆయనే కమ్మవారిలో కల్లా ప్రథమ పట్టభద్రుడు కావచ్చు ప్లీడరీకూడా చేశాడు. యిట్లా కుమాళ్ళకు విద్యాబుద్ధులు గరపించి, వివాహాలు చేసి, 82 వ యేట కాలధర్మము నొందాడు సుబేదారు.

వీరరాఘవయ్యగారు రాజసము గలవాడు. మంచి ముసద్దీయేగాక, వ్యవహారత కూడాను. బలం గలవాడు. ధైర్యసాహసాలుకూడా అధికమే. ఆయన ఈ గ్రామం చుట్టూ వున్న గుండేరుకు, చప్టాలు వేయించ ఆనాడే అర్జీలు పెట్టించి ఆందోళణచేసిన, ప్రజా సేవాభిలాషి. యింతేగాక ఘోటకం అనే పశుగ్రాస భూమిని చల్లపల్లి జమీందారుగారు ఘంటశాల గ్రామపెద్దల చేత కౌలు వ్రాయించుకొని అక్రమప్రవేశం చేయ తలపెట్టినప్పుడు ఆయనా ఆయన మిత్రులు కలసి దాని నరికట్టి ఆ పశుగ్రాసపు భూమిని యథాస్థితిగా గ్రామస్థుల వుపయోగానికి నిలిపిరి

వీరరాఘవయ్యగారికి 1904-12-3 తేదీన బ్రహ్మయ్యగారు జన్మించిరి.

యీయన జన్మించిన కొద్ది రోజులకు పై చెప్పిన ఘోటకం కేసుల్లో న్యాయవాదిగా ప్రజల పక్షాన పని చేస్తూన్న ఆయన పినతండ్రి సుబ్రహ్మణ్యేశ్వర స్వామిగారు నిస్సంతుగా చనిపోయిరి.

ఆయనపోయిన కొద్దికాలానికే వీరరాఘవయ్యగారికి, బ్రహ్మయ్యగారికి, వీరరాఘవయ్యగారి మారుటితల్లి, ఇది చనిపోయిన తన కుమార్తెలకే ఆస్తి సంక్రమించగలదనే సంకల్పంతో, విష ప్రయోగము చేసెను. వీరరాఘవయ్యగారు వెంటనే మరణించిరి. స్తన్యపానము చేస్తూన్న శిశువు లగుటవలన బ్రహ్మయ్యగారికి ఆ విషము ప్రాణహాని చేయలేదు. అంతటితో ఊరుకున్నదా ఆ దుర్మార్గురాలుకి వీరరాఘవయ్యగారి మరణానికి, భార్యా బంధువులు తల్లడిల్లుచున్న సమయంలో ఈ పసికందును పట్టుకొని గొంతునొక్కివేయనున్న సమయాన, ఆయన చిన్న మేనమామగారు చూచి మేనల్లుని భద్రమైన స్థానానికి చేర్చెను.

ప్రజాసేవ చేసి, రాష్ట్రఖ్యాతిపొంద ఈశ్వరసంకల్పమై యుండగా, స్వార్థపరుల విష ప్రయోగాలు, దురంతాలు, ఆయన యెడల విఫలమగుటలో ఆశ్చర్యము లేదు.

క॥ కాననమున రణమున సలి
లానల రిపుమధ్యమున మహోద్ధినగాగ్ర
స్థానమున మత్తు నిద్రితు
బూనికతో । బూర్వ పుణ్యములు రక్షించున్.

భర్తృహరి.

[౨]

# విద్యాభ్యాసము

ఉ॥ విద్య నిగూఢగుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటి ధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాడు మర్త్యుడే॥

—భర్తృహరి.

బ్రహ్మశ్రీ [illegible] మేనమామలు శ్రీ [illegible] ఘంట [illegible] ఈవిధంగా బలవన్మరణము నొందగానే, తమ తోబుట్టువున్ను, మేనల్లుని, వారి యింటికి తీసుకు వెళ్ళారు. ఆయనకు ఏడవయేట అక్షరాభ్యాసము పూర్వ సాంప్రదాయానుగుణ్యముగా జరిగెను. బాల్యమునుండికూడా ఆయన చదువుసంధ్యలలో సూక్ష్మబుద్ధిగల విద్యార్థులలోనివాడు. ప్రతితరగతియందును ఆయనే పెద్ద. ప్రైమరీవరకు చదివాడు. ఉపాధ్యాయులందరి మన్ననలకు పాత్రుడైనాడు. ప్రైమరీ చదువుచున్న రోజులలో బహు పెద్ద ఆయనే.

ఆయన నాల్గోతరగతి చదువుచున్న రోజులలో బిపిన్ చంద్రపాలును శిక్షించిన సందర్భమున ఆ గ్రామములో ఒక పెద్ద వూరేగింపు జరిగెను. పాఠశాల విద్యార్థులందరితోపాటు ఆయనకూడా అందు పాల్గొన్నాడు. కాని అప్పుడు బిపిన్ చంద్రపాలువలె తానుకూడా దేశంకొరకు పాటుపడి, జైలుకు వెళ్ళెదనని అనుకోలేదు. కాని అట్టి గౌరవమాయనకు దక్కుట అదృష్టముగదా!

ప్రైమరీ ప్యాసైనతరువాత, గ్రామములోవున్న నాగాసి చినఅచ్చన్నగారివద్ద, యింగ్లీషు విద్యాభ్యాసము నారంభించెను. ఆ అచ్చన్నగారు ఆ కాలంలోనే పిల్లలకొరకు ఒక గ్రంథాలయంస్థాపించి పత్రికలుకూడా తెప్పించి, విద్యార్థులచేత చదివిస్తూ, భాషాభిమానం దేశాభిమానం కల్గించాడు.

1913 వ సంవత్సరంలో బ్రహ్మయ్యగారు బందరు నోబుల్ కళాశాలలో ప్రవేశించాడు. 1906 లో ప్రథమంగా వితంతువివాహము చేసుకొన్న చోడవరపు జగన్నాథరావు గారు ఆయన క్లాసుటీచరు. ఆమాష్టరుగారు ఈ శిష్యుని గుణాలకు ముగ్ధులై, పితృవాత్సల్యముతో చూస్తూ, పండుగ పర్వాలను తన గృహమున కాహ్వానిస్తూండేవారు. నేటికీ ఆయన బ్రహ్మయ్యగారి శిష్యుడని, గర్వంగా చెప్పుకుంటూంటారు. ఆయనవలనకూడా కొంత దేశాభిమానము, సంస్కరణాభిలాష యీయనలో మొలకెత్తినవి.

ఘంటశాల గ్రామస్థుడును, ఆయనకంటె పెద్దవాడును అగు గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు బ్రహ్మసమాజ మందిరములో నుండుటచేత ఆయనకూడా అచ్చటనే వుంటూండే వాడు. ఆరోజులలో ప్రతి ఆదివారం బ్రహ్మమందిరములో ప్రార్థనలు జరుగుతూవుండేవి. అచటికి అక్కడవుంటూవున్న విద్యార్థులు బందరులోని బ్రహ్మసమాజాభిమానులు వస్తూండే వారు. తరచుగా ముట్నూరి కృష్ణారావుగారే ప్రార్థనలు చేస్తూండేవారు. తద్వారా సంస్కరణాభిలాష, దేశాభిమానము వృద్ధిగాంచినవి.

స్కూలు ఫైనల్ వరకు ప్రతి సంవత్సరం తప్పకుండా గెలుస్తూండేవాడు. ఆయన పాఠాలు యెక్కువకాలం చదవక వార్తాపత్రికలు తెలుగుపుస్తకాలు చదువుతూ వుండేవాడు. అయినప్పటికి ప్రతి తరగతిలోను, తెలివిగల విద్యార్థులలో ప్రథమునిగా వుంటూవుండేవాడు. 1916 సం॥లో స్కూలు ఫైనలునందు కృతార్థుడుగా లేడు. మరుసంవత్సరము చదువుచుండగా విషజ్వరమువచ్చి కొన్ని మాసములు వ్యాధిగ్రస్తుడగుట సంభవించెను. అందుచేత ఆ సంవత్సరము చదివే అవకాశము లేకపోయినది.

మరల ఆ సంవత్సరము చదువునప్పుడు రామయ్యగారు చెప్పారు. శాస్త్రి ముట్నూరి కృష్ణారావుగారి బ్రహ్మసమాజపు ఆదివారపు ప్రసంగాలు, కొండూరి వెంకటాచలపతయ్యగారి కృష్ణాపత్రికలో ఆంగ్ల విద్యాభ్యాస విముఖత్వమునుగూర్చి వ్రాసిన వ్యాసాలు ఆయనను విద్యావిముఖునిగా చేసినవి. అందుచేత యింక కళాశాల విద్య చాలనుకున్నాడు. అనంతరం పునః విద్యాభ్యాసము చేయనందుకు అప్పుడప్పుడు విచారించిన సమయాలుకూడా లేకపోలేదు.

ఆయన పుత్రపౌత్రులకి తనపనులమీద వుద్యోగం చేయాలని అభిలాషవుండేది. మేనమామకు బ్రహ్మయ్యగారు పిన తండ్రివలెనే న్యాయవాది కావాలనే అభిలాషవుండేది. ఆయన స్కూలు ఫైనల్‌తోనే విద్యకు స్వస్తిచెప్పుటచేత బంధువుల ఆశలన్నీ నిరాశలైనవి.

విద్యావంతుడు కానందుకు ఆయన బంధువులు, ఆయన అప్పుడప్పుడు పరితపించునట్లుగా మనము విచారించ నక్కర

లేదు. వున్నత విద్యావంతుడైనట్లయితే ఆకాలంలోనైనా ఎట్లో యేదో వుద్యోగం చేయడమో, లాయరుగా వుండటమో సంభవించేది. అట్టి ప్రయత్నములు విఫలమగుట వల్లనే యీనాడు దేశసేవకు అవకాశములు కలిగినవి. యీవిధంగా ఆయన విద్యావైముఖ్యము జనోపకారమే యైనది.

ఆయన చదువుకునేరోజుల్లో బందరులో కమ్మవిద్యార్థి సంఘమంటూ వొకటివుండేది. స్కూలునుండి రాగానే ప్రతి దినము ఆసంఘభవనమునకు వెళుతూ అచ్చట పుస్తకాలు, పత్రికలు చదువుతూ, ప్రతి ఆదివారం జరుగుచర్చా సంఘము లలో పాల్గొంటూ వుండేవాడు. ఆకాలంలో ఆయన స్వదేశీ వస్త్రములు ధరిస్తూ పచ్చని పెద్ద తలపాగతో బడికిపోతూ, తోటి విద్యార్థులతో రాజకీయ, సాంఘికవిషయాలు, ప్రజాస్వామ్య సమాజపు సిద్ధాంతాలు ప్రసంగిస్తూ వుంటే ఆయన వేషభా షలజూచి మిత్రులు ఆయనను దేశాభిమానిగా గౌరవించే వారు. ఆకాలంలోవిద్యార్థులు నేటివలె పత్రికలు చదివేవారు కాదు. ఆయన నిత్యం పత్రికలు చదవటం తెలుగులో గల రాజకీయగ్రంథాలు చదవడంవల్ల విద్యార్థి దశలోనే ఆయనకు రాజకీయ పరిజ్ఞానము కలిగినది.

యిట్లా పత్రికలు చదవడమేగాక పలుసభలకు వాలంటీరుగాకూడా వెళ్ళేవాడు. 1916-4-21 సం॥లో గుడివాడలో జరిగిన కృష్ణామండల సభకు స్వచ్ఛంద సేవకుడుగా వెళ్లెను. మండలసభ అంటే కేవలం మండలసభయేగాదు. దానినిపుర స్కరించుకొని, పత్రికాధిపతులసభ, ఆస్తికమహాసభ సంఘ సంస్కరణసభ, నిమ్నజాత్యుద్ధరణసభ, కమ్మమహాజనసభ

# కమ్మ విద్యార్థి వసతి గృహ సభ్యులు

కుడినుండి కుర్చీలలో కూర్చున్నవారిలో 2. కొల్లిపర సూరయ్యగారు 4. కానూరి వెంకటచలపతయ్యగారు. వారి వెనుక నిలబడినవారిలో రెండవ వరుసలో 5. గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు చేతులు కట్టుకున్న సౌమ్యమూర్తి 3 వ వరుసలో 2. గ్రంధకర్త (టోపి)

చివరి వరుసలో రెండవవాడు తెలగుడ్డలో మన రైతు పెద్ద.

మొదలగు సభలు కోలాహలంగా ఆరు రోజులు జరిగినవి. ఆసభా సందర్భములో పెద్దల నందరిని దర్శించడమే గాక, వారి వాగామృతమును గ్రోలి ఉత్సాహోత్తేజములపొందుట కూడా జరిగినది. బందరులో జరిగిన, ఆంధ్ర విద్యార్థి సభలో కూడా స్వచ్ఛంద సేవకుడుగా పనిజేసి ప్రశంశా పాత్రుడ డయ్యాడు.

ఈ విధంగా విద్యార్థి దశలోనుండి, సూక్ష్మగ్రాహ్యత చొరవ, చురుకుగల్గి సేవా తత్పరతతో ప్రజా వ్యవహారాల యందు పాల్గొంటూ పెద్దల ప్రశంసలకు పాత్రుడయ్యెను. పూవు పుట్టగనే పరిమళించునుగదా !

"అరుణ రేఖలు ఉషోదయమును సూచించునట్లు
బాల్యము జీవిత భవితవ్యమును చూపును"

Childhood shows the man
As morning shows the dawn.

---

## ఇంట గెల్చి రచ్చ గెలుచుట

ఆరయ నేడు, నీమహిత యత్నము చేతనే ఘంటశాలయున్
చేరు ప్రతిష్ఠ లబ్బెనుసుమీ, సకలాంధ్ర జగత్తులోపలన్
వేరుగ పృచ్ఛసేయుదురు విన్న పదిమంది నెల్లచోట్ల నీ
పేరున చెప్పుకొందు మతి ప్రేమున, మేమును గౌరవా ప్తికై.

—ఆ. గుర్నాధరావు

ఘంటశాల చరిత్ర ప్రసిద్ధిగల గ్రామం. ప్రాచీన చరిత్రేగాక ఆధునిక చరిత్రకూడా దానికి కలదు. ప్రాచీన ప్రఖ్యాతి గాంచిన కొన్ని గ్రామాలు నామమాత్రాలు లేక నశించినవి. కొన్ని నామ మాత్రావశిష్టములై యున్నవి. ఘంటశాల అట్లుగాక, నాటివలె నేటికి ప్రసిద్ధి గాంచియుం డుట స్థలమహాత్మ్యమా? స్వగ్రామాన్ని ప్రముఖ్యంగాను కాంగ్రెసుకు పెట్టని కోటగా చేసిన సంగతి వివరించే ముందు, ఆ గ్రామ పరిచయం అవసరం.

ఘంటశాల కంటకసోలగా బౌద్ధ యుగమున ఖ్యాతి గాంచిన సంగతి చరిత్ర పరిచయమున్న వారందరికి తెలిసిన విషయమే. చాళుక్య యుగమున చోళ పాండ్యపురమనే నామాంతరంతో చెన్నారింది.

జమీందారీ యుగంలోకూడా యీ గ్రామం ఖ్యాతి గాంచింది. గొర్రెపాటి బాలకృష్ణమ్మగారు (1884–1966) జమీందారీ రైతు పోరాటములో నాయకత్వము వహించి రైతుల కష్టనష్టముల నీడేర్చెను. ఈ యస్టేటులో, వెట్టి చాకిరీ మాన్పించిందాయనే. ఆయన వర్చస్సుచేతను, వర్తనచేతను, విద్యచేతను, విఖ్యాతుడు. ఆయన పేరుతో ఈ గ్రామ ప్రతిష్ఠ పెరిగింది. అనాటినుండి యీ గ్రామం నాయకత్వం వహించి పెక్కు రంగాలలో ప్రసిద్ధి గాంచింది.

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క గ్రామానికి ప్రసిద్ధి కల్గడం ఆ గ్రామాన్ని ఆదర్శంగా పెట్టుకొని తదితర

---

* దేశకవితా మండలిచే ప్రచురింపబడిన ఘంటశాల చరిత్ర చూడదగును.

గ్రామాలు నడవడం పెద్దలకు పరిచయ విషయమే. ఘంట శాల అట్టి ఆదర్శ గ్రామాల్లో ఒకటి.

బాలకృష్ణమ్మగారి అనంతరంకూడా అప్పటప్పటికి ఈ గ్రామంలో ప్రముఖులు పుట్టి ఈ గ్రామపేరు ప్రతిష్టలు నిలుపుతూ వచ్చారు. ♦

బ్రహ్మయ్యగారు ఆయనతోపాటు చదువుకొన్న మరి కొందరు యువకులు ఈ గ్రామంలో ఆయనవలెనే విద్య మాని, గ్రామంలోవుంటూ గ్రామసేవతోపాటు దేశ హితైక కార్యములుకూడా చేస్తూవుండిరి. 1917 సం॥ లో ఈ ప్రాంత ములో కాంగ్రెసు-లీగు స్కీము, సంతకాలు అధికంగా చేయించుటతో వారి రాజకీయ జీవితము ఆరంభమాయెను.

గ్రామ వ్యవహారాల్లో పాల్గొంటూ, దేశసేవచేయ జొచ్చిరి. గ్రామంలోవుండే పార్టీలు అప్పటికే అంతరించినవి. యీ యువకులు వృద్ధిలోకి రాగలరని, గ్రామానికి ప్రతిష్ఠ, ప్రయోజనము కలిగించగలరని, పెద్దలు వీరియందు ఆదరము, అభిమానము, వాత్సల్యము చూపుచు, వీరిమాటలను,

♦ పట్టాభి సీతారామయ్యగారు, యీ గ్రామం కాంగ్రెసు చందాకై వచ్చినప్పుడు, యిక్కడ జరిగిన సభలో సంగతి సందర్భాలన్నీ గమనించి, ఘంటశాలవారి మాటలోను మర్యాదలోను ఒక ప్రత్యేకత వున్నది. వారు వ్యక్తిగతంగా గాక సమిష్టిగా చందాలు యిస్తారు. యిక్కడ ప్రాచీన పద్ధతిని, అరకలవెంట, మగ్గముల వెంట బాడిశల వెంట చందాలు వసూలుచేస్తారు. మిగతా వారివద్ద, యిలావసిన వసూలు చేస్తారు. యిట్టి పద్ధతి యితరత్రా అరుదు. యిట్టిస్థితి ఐకమత్యం వచ్చిన గాని మనకు స్వరాజ్యంరాదు. యీ విధంగా ప్రశంసిస్తూ తన జన్మభూమి పత్రికలో ఘంటశాలను గూర్చి పెద్దవ్యాసం ప్రకటించారు.

మన్నించుచుండెడివారు. అందుచేత గ్రామస్థులందరికి యీ బృందము పడ అభిమానం అధికంగా వున్నది. ఈ బృందము లోనివారందరు సమవయస్కులు, సమానవిద్యావంతులైనా, బ్రహ్మయ్యగారి శక్తి సామర్థ్యాలు ఈ యువజన బృందానికి నాయకునిగా చేసినవి.

గాంధిమహాత్ముడు అసహాయోద్యమం ఆరంభించెను. దేశమంతటా నూతనచైతన్యము వెల్లివిరిసెను. కొని ప్రజలు యెవరికార్యాలు వారు చేసుకుంటూవుంటారు. సమర్థవంతమైన నాయకత్వముండాలి, ఉద్యమం జయప్రదం కాదు. ఈసంగతినిగురించి పండిత జవహరిలాల్ నెహూ్రు యిట్లు ప్రవచించాడు. "సంఘంలో విప్లవాలు మార్పులు నిరంతరమైన ప్రజాఉద్యమాలవల్ల రావు. ప్రజల ఉద్రేకశక్తి కెరటాలవలె లేస్తూ, పడుతూవుంటుందని, జ్ఞప్తిలోవుంచుకోవాలి.సంఘంలో యెక్కువమందికి తమదైనందిన వ్యక్తిజీవితపు అవసరాలను తీర్చుకోవడమే పరమార్థమాతుంది. కొలదిమంది ఆదర్శజీవులు పట్టుదలతో నిల్చి మార్గదర్శకులుగా పనిచేయడం ద్వారానే సంఘంలో పరివర్తనం కలుగుతుంది."

అట్టి ఆదర్శనాయకత్వము వహించి బ్రహ్మయ్యగారు ఈగ్రామంలో కృషి కొనసాగించినందువనే, ఈ గ్రామంలోను పరిసర గ్రామాలలోను, కాంగ్రెసు వుద్యమం వృద్ధిగాంచింది.

## యెన్నికలు

1920 సంగలో శాసనసభా యెన్నికలు వచ్చినవి. కాంగ్రెస్ శాసనసభా బహిష్కారం ప్రకటించింది. అందు

వల్లనే కాళేశ్వరరావు, కానూరి వెంకటసుబ్బయ్య వంటి కాంగ్రెసువాదులు తమ అభ్యర్థిత్వాలను వదులుకున్నారు. జస్టిసుపార్టీవారు కాంగ్రెసుపై కత్తిగట్టి ప్రభుత్వానికి అండగా నిలిచారు.

కాంగ్రెసు ఉద్యమ ప్రచారము ఉధృతమైనది. దివి తాలూకా కాంగ్రెసుసభ 1920–10–10 తారీఖున కావూరి కోదండరామయ్యగారి అధ్యక్షత క్రింద ఘంటసాలలో బ్రహ్మయ్యగారి కృషిఫలితముగా జరిగింది.

తాలూకా అంతటినుండి వేలాదిజనం వచ్చారు. కొండూరి శివరామకృష్ణారావు, కానూరి వెంకటచలపతయ్య, చెరుకువాడ నరసింహం మొదలైన ప్రముఖులు ఉపన్యాసము లిచ్చిరి. యీసభతో ఈ తాలూకాయందంతటను చైతన్యము అధికంగా కలిగెను. యీసభకు తాలూకా కాంగ్రెసు సభ అని పేరుపెట్టినను యీ తాలూకాలోనే గాక, యీ జిల్లా అంతట్లోను జరిగిన మొట్టమొదటి రాజకీయసభ. ఈ సభ దిగ్విజయంగా జరుగుటచేత ఆయన రాజకీయ జీవితానికి అధికంగా తోడ్పడింది.

యీ సభతోనే తనకర్తవ్యం నెరవేరిందని తలచలేదు. తన యువజన మిత్రబృందతో ఆనాడు తాలూకా అంతా సంచారం జేసి ప్రభోధించాడు.

చెరుకువాడ నరసింహం, కృష్ణారావు, బోడి నారాయణరావుగార్లు మొదలైన పెద్దలతో కలసికూడా ప్రచారం గావించెను.

తాలూకా ప్రచారం పూర్తయినది. ఎన్నికలు సమీపించెను. ఇక ఘంటశాల పోలింగులో ఒక ఓటు కూడా పడకుండ చూడాలని పట్టుదలతో పని ప్రారంభించాడు. అందుచేత పోలింగు ప్రదేశములోని ప్రతిగ్రామములోను విరివిగా ప్రచారము ప్రారంభించెను. ఘంటశాలలో పెద్దపెద్ద సభలుజేసి, విరివిగా ప్రబోధము కల్గించెను.

రేపు వుదయం యెన్నికలనగా ఆ రాత్రి, ఆరోజులలో అధికంగా వుండే రామభజనసమాజముల నన్నిటిని కూడా వేశవర్పి, కోలాహలంగా వారిచే భజనలు చేయించి అక్కడనే ఒక పెద్దసభ ఒకటి యేర్పాటు చేయించి, మర్నాడు వుదయం గ్రామస్తులందరు పనులు మాని, ఘంటశాల పోలింగులోని గ్రామాదులకు వెళ్ళి వోటర్లు యెవరూ వోటుచేయకుండా చూడాలని ఈ గ్రామంలో పోలింగుదగ్గర, సుశిక్షితులైన మెలిగేవారందరు వుండాలని జిల్లా కాంగ్రెసు ఆదేశానుసారంగా పనిచేసి గ్రామానికి, దేశానికి ప్రతిష్ఠ కేవలశింపని హెచ్చరించాడు. తదనుసారంగా కార్యవిభజనకూడ జరిగెను.

ఆయన ఆదేశాన్ననుసరించి తెల్లవారేసరికి, ఘంటశాల పోలింగు ప్రదేశంలోని వివిధగ్రామాలకు, వుత్సాహవంతులైన యువజనులంతా వెళ్ళిరి. ఓటర్లెవ్వరు పోలింగు స్టేషనుకు వెళ్ళకుండా అమిత వుత్సాహ దీక్షలతో పనిచేసిరి.

పోలింగుస్టేషనువద్ద బ్రహ్మయ్యగారు, గ్రామంలోని కొందరు యువకులను, ప్రముఖులను చేర్చుకొని, వివిధ గ్రామాల నుండి వచ్చిన గ్రామోద్యోగీయులను కాంగ్రెసు ఆజ్ఞలను మన్నించవలసినదిగా హెచ్చరించిరి.

సాయంకాల మైనప్పటికి ఒక్క ఓటరుకూడా ఓటు యిచ్చుటకు రాలేదు. పోలింగు ఆఫీసర్లు ఆశ్చర్యచకితులై కూర్చున్నారు. గ్రామోద్యోగుల్లో కొందరికి ప్రభుత్వంవారి వల్ల తమ కేదైనా మాటవస్తుందేమో అని సందేహం కలిగింది. ఘంటశాల మున్సబుగారగు గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు తాను చెప్పిన విధంగా తదితరులుకూడా ప్రభుత్వంవారికి సంజాయిషీ చెప్పవచ్చుననీ, భయపడవలసిన అవసరం లేదని ధైర్యము చెప్పి వారి సంశయములను బాపిరి. కానిని కొడాలి మున్సబుగారగు తుమ్మల శ్రీరామయ్యగారు బలపర్చిరి. అందువల్ల గ్రామోద్యోగులుకూడా ఒక్కమాటమీద నిలబడి ఓటుచేయ నిరాకరించిరి.

అన్ని పోలింగుల్లోను ఓట్లు యివ్వటం ఘంటశాల పోలింగునుంచి ఖాళీ పెట్టెలు పంపటంవలన, ఘంటశాల పేరు ఆంధ్రదేశ మందంతటా వ్యాప్తిగాంచింది •

1923 సం॥ లో జరిగిన యెన్నికల సందర్భములో ఓట్లు యివ్వదలచినవారు యివ్వవచ్చునని కాంగ్రెసు తీర్మానించెను. కోనెలమూడి గోపాలకృష్ణయ్య, మాగంటి సీతయ్య కానుమిల్లి సర్వారాయుడు, బొల్లిన నారాయణస్వామి

---

• అట్లు ఖాళీపెట్టెలు పంపినతర్వాత ఈ గ్రామ ప్రముఖులలో నొకరగు దోనేపూడి వెంకట్రామయ్యగారు జిల్లాకోర్టు నకు ఆసామిగా వెళ్ళగా, ఆయనవల్ల జిల్లాజడ్జిగారు గ్రామసంగతి సందర్భములు విని ఆశ్చర్యపడిరి. ఫ్లీడరు ప్రాసిక్యూటరుగా నున్న కడింది హనుమంతరావుగారు ఆ గ్రామసంగతి సందర్భము లన్నియును తమకు తెలుసుననియు, యీ ప్రాంతములోకెల్ల చైతన్యవంతమై ఐకమత్యముగాయుండు గ్రామమని ప్రశంసించిరి.

నాయుడు, పెనుమత్స పెద్దిరాజు, కొ[illegible] రెడ్డి ప్రభృతులు అభ్యర్థులుగా నిలబడిరి. కమ్మవారిలో కొందరు [illegible] వెలుగూరు కమ్మవారికే ఓట్లియ్యాలని ప్రచారం సాగించారు. బ్రహ్మయ్యగారు కులతత్వాలు పనికిరావని చెప్పుతూ కాంగ్రెసుకు సుముఖులైన జాతీయవాదులగు పెనుమత్స పెద్దిరాజు, సూరంటి సీతయ్యగార్లకు ఓట్లివ్వాలని ప్రబోధిస్తూ, కమ్మసంఘీయులై జస్టిసు పార్టిసభ్యులై లోగడ శాసన సభాసభ్యులై కాంగ్రెసు సిద్ధాంతాలను ఖండించిన కో[illegible] మూడివారికి ఓట్లు యివ్వరాదని హెచ్చరించిరి.

1926 సం॥లో యెన్నికలు వచ్చినవి. కాంగ్రెసు తరఫున కాళేశ్వరరావు, సూరయ్యగార్లు నిల్చారు. జస్టిసుపార్టి తరఫున మీర్జాపురం జమీందారుగారు, అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారు నిల్చారు. కొళందరెడ్డిగారు స్వతంత్రంగా నిలబడిరి. మీర్జాపురంరాజాగారు తమ యేజంట్లద్వారా ఈ ప్రాంతంలో కొందరి ప్రముఖుల పేర్లు తమ మ్యానిఫెస్టోలో వుదహరించారు. అట్లాగే కొళందరెడ్డిగారు చేశారు. యీ మ్యానిఫెస్టోలో ప్రకటించిన ప్రముఖుల పేర్లద్వారా తమ అభ్యర్థిత్వాల్ని బలపరచుకొని ఓట్లు సంపాదింప నమకట్టిరి. నిజానికి ఆ మ్యానిఫెస్టోలో ప్రకటింపబడిన ప్రముఖులలో కొంతమందికి దానిసంగతియే తెలియదు. అందులో కొంత మంది కాంగ్రెసుకు అనుకూలురు. కొంతమంది ప్రముఖులకు ఆ అభ్యర్థులకు యేవిధా సంబంధము లేదు. యిట్టి స్థితిలో యీ మ్యానిఫెస్టోలలోని మోసమును బ్రహ్మయ్యగారు గ్రహించి ఆయా ప్రముఖులను సందర్శించి విచారించగా

అందులో చాలమంది తమ కసలా సంగతియే తెలియదని, తాము కాంగ్రెసుకు అనుకూలమని తెల్పిరి. అంతట బ్రహ్మయ్యగారు జిల్లాఅంతటా సంచారమొనర్చి ఆ మ్యానిఫెస్టోలోని ప్రముఖుల నిజమైన వుద్దేశములను గురించి ఆ మ్యానిఫెస్టోలోని బూటకమును గూర్చియు ఆయా ప్రముఖులవద్ద స్టేటుమెంట్లు తీసుకొని అవి పత్రికలలో ప్రకటింపజేసిరి. మరియు ఆయా అభ్యర్థులకు రిజస్టరీ నోటీసులనుకూడా పెట్టించిరి. జిల్లా యందంతటా సంచారము గావించి కాంగ్రెసు అభ్యర్థులైన సూరయ్య, కాళేశ్వరరావుగార్ల అభ్యర్థిత్వమును బలపరుస్తూ ప్రచారముగావించి ఘంటశాల పోలింగులో ఓట్లన్ని కాంగ్రెసు అభ్యర్థులకే ఇప్పించిరి.

ఘంటశాలలో తనకు ఒక ఓటుకూడ పడకపోవుటేగాక ఈ గ్రామ పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగు వేమూరి వెంకయ్యగారిచే తన సంతకాన్ని ఉపయోగించుకో వద్దని మీర్జాపురంరాజాగారికి నోటీసు ఇప్పించుటచే ఈ గ్రామంలో గ్రామత్యా కంట్రాక్టు తీసుకొని త్రవ్వించిన చెరువు పని మొత్తం రు. 2700/- లు ఇవ్వకుండా చేసిరి. బ్రహ్మయ్యగారు 1927 లో తాలూకాబోర్డు అధ్యక్షత వహించిన తర్వాత ఆసొమ్మును యిప్పించిరి.

## పంచాయతీసభ

కాంగ్రెసు సందేశానుసారం ఓట్లు సంపాదించడంతోనే తన కర్తవ్యము తీరిందని తలచలేదు, బ్రహ్మయ్యగారు. కాంగ్రెసు కోర్టులనుకూడా బహిష్కరించింది. గనుక గ్రామమునుండి యే వ్యవహారము కోర్టుకు పోకూడదని తలచారు.

అంతట గ్రామములో ప్రముఖ పెద్దలను సమావేశము పరచుకొని వారితో సంప్రదించి ఒక పంచాయితీ సభను ఏర్పాటు గావించిరి. ఈ సభలో హరిజనులలోను యితర వర్ణాలలోను పంచాయితీ చెప్పుటకు అర్హులగువారిని సుమారుగా [illegible] వ్యక్తుల పేర్లుగల పట్టికలను తయారు చేయబడెను.

గ్రామంలో యేదైనా తగాదా వస్తే యిరు పక్షాల వారు చెరొక మధ్యవర్తిని ఆ మధ్యవర్తులు యిద్దరూ కలిసి ఒక పెద్దమనిషిని ఎన్నుకోవడం ద్వారా వ్యవహారములన్నీ పరిష్కారం జరుగుతూండేది.

యీ పంచాయితీ సభ 12-12-1921 సం॥లో యేర్పాటుగాబడి చాలాకాలంవరకు గ్రామంలోని సివిల్ క్రిమినల్ వ్యవహారాలు పరిష్కరిస్తూ ప్రఖ్యాతి గాంచింది *

## మద్యపాననిషేధం

మద్యపాన నిషేధం విషయంలో కూడ చాలా కృషి చేశాడు. 1921 సం॥లో తాటాకు లన్నింటిని నరికించి

---

* యీ పంచాయితీ సభ బాగుగా పనిచేయుచుండుటచేత పోలీసు సర్కిల్ యిన్స్పెక్టరు వెంకటప్పయ్యనాయుడుగారు 1923 సం॥లో చల్లపల్లి క్యాంపునకు దీని కర్తయైన గొర్రెపాటి వెంకయ్యగారిని ఈ సభా స్థాపకులయిన బ్రహ్మయ్యగారిని పిలిపించిరి. అంతట ఆయనగారు క్రిమినల్ కేసులు రాకుండా చేస్తున్నారట, మీ పంచాయితీకోర్టు యెక్కడ అని ప్రశ్నించాడు దానికి బదులుగా బ్రహ్మయ్యగారు మా వ్యవహారాలన్నీ చెట్లక్రిందనే పరిష్కారం చేసుకుంటున్నాము. సివిలో, క్రిమినలో, మా వ్యవహారాలు మేము పరిష్కారం చేసుకోవడం తప్పా అన్నాడు. సర్కిల్ యిన్స్పెక్టరుగారి బెదరింపులకు బ్రహ్మయ్యగారు లొంగనందున ఆయనపై వారి సమాధానంకోసం యేదో రిపోర్టు వ్రాసి పంపారట.

తాళ్ళు గీతకుపీలులేకుండా చేశారు. 1922 సం॥ లో యీయన కృషి ఫలితంగా ఆబ్కారీ దుకాణమును పాడినవారే లేక పోయిరి. తర్వాతకూడా యీ గ్రామస్తులు చెట్లు గీత కివ్వ నందునను, పాటదార్లు పాడనందునను, ప్రభుత్వము పరాయి గ్రామస్తులను ప్రోత్సహించి పాడించింది.

ఆ పాటదార్లకు గీతకు గ్రామంలో చెట్లు దొరక లేదు. చుట్టుపట్ల గ్రామాలలో గీయుకొని యిక్కడ దుకాణం పెట్టగా కాంగ్రెసు వాలంటీర్లను ప్రోత్సహించి పికెటింగు చేయించిరి. పికెటింగు చేస్తూన్న వాలంటీర్లను ప్రథమంలో లాటీఛార్జి చేయుట, లాటీఛార్జి అనంతరంకూడా పికెటింగు మానకపోయినందున వారిని అరెస్టు చేయడం జరిగింది. అనంతరం యీ గ్రామంలో యిందు విషయమై పట్టుదల ఉద్రేకం పెరిగి, ఉన్నత కుటుంబములకు చెంది, యేనాడును యిల్లు బయలువెడలని మహిళామణులుకూడా దుకాణము నకు యెదురుగా నిలబడి అతి పట్టుదలతో నెలరోజులు పికె టింగు జరిగించిరి. దుకాణము కట్టివేయవలసిన స్థితి యేర్ప డెను. అంతట పోలీసువారు స్త్రీలనుకూడా అరెస్టుగావించి జైలుకంపిరి.

## పన్నుల అవుదల

1921 సం॥ ప్రాంతములో కాంగ్రెసు పన్నులను యివ్వవద్దని ఆదేశించెను. ఆ ఆదేశానుసారం, యీ గ్రామ స్తులెవ్వరు పన్నులను చెల్లించలేదు. ఉద్యోగులు, మాగానికి నీరుయివ్వమని, భూములను జప్తు చేస్తామని బెదరించిరి.

గాని రైతులు పట్టువిడువలేదు. కాంగ్రెసు ప్రతినిధులుగాను ఇయ్యవలసినదిగా, అభ్యర్థించిన తర్వాతనే సమస్య పరిష్కారమైంది.

## ఖద్దరు

ఖద్దరుఉత్పత్తిలోను ఘంటశాలవున్నత స్థానము వహించింది. 1934 సం॥లో ఆగస్టు 10 వ తారీఖున బ్రహ్మయ్య గారు తమ మిత్రుల సాయంతో పదివేల రూపాయలు పెట్టుబడితో దేశోద్ధారక నాగేశ్వరరావు ఖద్దరు సంఘం స్థాపించి, ఖద్దరు పరిశ్రమకు తోడ్పడిరి. ఈ గ్రామములో యింటింటా రెండుమూడు రాట్నములు గలవు. ఈ సంఘం అఖిలభారత చరఖాసంఘంవారిక్కడ శాఖను స్థాపించేవరకు సక్రమంగా పనిచేసింది. ఘంటశాల ఖద్దరు, సన్నదలో మంచి నాణ్యమైనదని ప్రసిద్ధిగాంచింది. బొంబాయి, గుజరాతు, ప్రముఖులు ఘంటశాల ఖద్దరు కోరి తెప్పించుకొందురు.

## మహాత్ముని మన్నన

1929 సం॥ లో గాంధిమహాత్ముడు ఖద్దరునిధికై ఆంధ్ర దేశము సంచారము, చేయసాగెను. కృష్ణాజిల్లా వచ్చినప్పుడు బ్రహ్మయ్యగారు, కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్యగార్లతో కలసి మహాత్ముని సంచార కార్యక్రమంలో పాల్గొనెను.

20–4–1929 తారీఖున గాంధిమహాత్ముడు ఖద్దరు నిధికై యీగ్రామం వచ్చినప్పుడు ఘోటకంలో ఒక గొప్ప సభ జరిగెను. ఆసభలో ప్రథమ శ్రేణిలో స్త్రీలు కూర్చుండి రాట్నములు వడకుచుండిరి. మహాత్ముడు వచ్చినను ఎటి

అలజడి లేక నిశ్శబ్దముగ నెక్కడి వారక్కడ సుశిక్షితుల వలె నుండుట చూచి, ముగ్ధుడై ఆయన తన పావుగంట కార్యక్రమమును ఒక గంటవరకు పొడిగించి యిచ్చుటే గ్రామ శిక్షణను, కార్యక్రమములను మెచ్చుకొనిరి. ♦

మహాత్ముడు వచ్చేసరికి చుట్టూవీధులుతీర్చివాసములు నాటి గ్రామ శిక్షణ నొందిన అనేకమంది వాలంటీర్లు నిలబడి ప్రజలను అదుపులో వుంచుచుండిరి. మహాత్ముడు కాంగ్రెసు యూనిఫారం గల యీ వాలంటీర్లను చూచుట తోడనే 'Is this your national army' 'యిది మీజాతీయ సైన్యమా' యని ప్రశ్నించెను.

మహాత్ముడు యీసభలో హిందూధర్మము బ్రాహ్మణులు అనే శీర్షికతో ఒకగంట వుపన్యసించెను. టైము అయిపోయిందని బ్రహ్మయ్యగారు డాక్టరు పట్టాభిగారితో చెప్పగా వారు, మహాత్మునికి మనవిజేసిరి. నాదగ్గరా గడియారమున్నదని చమత్కారంగా అంటూ గడియారాన్ని చూపించి, మరికొంత కాలం వుపన్యసించారు.

---

♦ బ్రహ్మయ్యగారు మహాత్ముని తాలూకా ప్రయాణ కార్యక్రమం నడుపుచుండెను. మహాత్ముడు ఘోటకంలోనికి రాగానే యిక్కడ మరి కొన్ని నిమిషములు వుండవలసినదని మనవిజేసెను "యిది నీ గ్రామమా" అని మహాత్ముడడిగెను "నా గ్రామముకాదు. యీ గ్రామం యీ జిల్లా కాంగ్రెసు కార్యక్రమములో అన్నివిధముల ప్రఖ్యాతమైన పెద్దగ్రామము. యిది సెంటరు, వివిధ గ్రామాలనుండి విశేషజనం వస్తారు.. గనుక కోరుచుంటినని" ఆయన అనెను. అంతట "నీవు చెప్పిన చొప్పున వున్నచో అప్పటి పరిస్థితిని బట్టి ఆలోచించెద"నని మహాత్ముడు బ్రహ్మయ్యగారితో అనెను.

చుట్టుపట్లనుండి నిశేషజనం వచ్చేవారు. వివిధ గ్రామాలవారు యిచ్చట మహోత్సవమునకు హాజరయ్యేవారు. స్త్రీలు అనేకులు తమ ఆభరణాల నర్పించేవారు.

## హరిజనదేవాలయ ప్రవేశము

అస్పృశ్యతా నివారణోద్యమంలోగూడా ఆయన అత్యధిక కృషి యొనర్చినాడు. ఈ గ్రామంలో మార్గశిరశుద్ధషష్ఠికి సుబ్రహ్మణ్యస్వామికి గొప్ప వుత్సవం జరుగుతుంది. ఆవుత్సవ సమయమున హరిజనులతోబాటు సవర్ణులుగూడా యీ గ్రామంలో గుడిబయటనే పూజచేసిరి.

ఈ విధంగా ఆంధ్రదేశంలో ముందుగా చేసిన హరిజన దేవాలయప్రవేశం అనతికాలంలో జరుగగలందున ఘంటశాల వారిని ఆదర్శ ప్రాయంగా యెంచుకొని కృషిచేయవలసిందని 1932 సం॥ డిశంబరులో ఆంధ్రపత్రిక సంపాదకీయం వ్రాసి ప్రశంసించింది.

1933 సం॥ లో బ్రహ్మయ్యగారు కారాగృహము నుండి విడుదలైనతర్వాత గ్రామంలో (ప్లెబిసైట్) ప్రజాభిప్రాయాన్ని తీసుకొనిరి. ప్రజలలో నూటికి 90 మంది దీనికి సుముఖులుగా నుండిరి. అందుచేత ఆసంవత్సరము షష్టివుత్సవానికి హరిజన దేవాలయప్రవేశము అతి వైభవముగా జరిగెను. నాటినుండి యీ గ్రామంలో అస్పృశ్యతాదోష మడుగంటెను.

## దీపావళి

మనం బానిసలంగా వుండుటేగాక విశేషముగా దీపావళి బాణసంచాను మానవలసిందని మహాత్ముడు ప్రబోధించడం సర్వజనవిదితము. ఆ సందేశానుసారం బ్రహ్మయ్యగారు అధికకృషి యొనర్చి, తదాది చాలాసంవత్సరముల వరకు బాణసంచాను కాల్చుటను మాన్పించిరి.

### సంక్రాంతి [illegible]

ఆంధ్రదేశమంతటా సంక్రాంతిరోజున ప్రతిగ్రామంలోను కోడిపందాలు వేయటం, జూదాలు ఆడటం అనే ఆచారాలు అనుశ్రుతంగా వస్తున్నవి. యీ గ్రామంలోని విశాలమైన ఘోటకంలోనికి వివిధగ్రామాలనుండి విశేష జనంవచ్చి ఆపండుగ నాల్గులోజులు కోడిపందాలువేయడం, జూదాలు ఆడటం జరిగేది. అసహాయోద్యమం వుధృతంగావున్న ఆకాలంలో ప్రచార ప్రబోధములద్వారా బ్రహ్మయ్యగారు దానిని రూపుమాపిరి.

యిట్లా అనేకవిధాల కృషియొనర్చి ఘంటశాలను ఒక ఆదర్శవంతమైన గ్రామంగాచేసి తననాటి యువకులకు మార్గదర్శకులైరి. ♦

అందువల్లనే ఆయనయెడల గ్రామవాసులకు విశేష ఆదరాభిమానము. ఆయన 1942 సం॥లో డిటెన్యూగా

---

♦ గ్రామస్థులను ప్రజ్వలింపచేయగల స్వాతంత్ర్యజ్వాల ఆయనలో మూర్తీభవించుటచేతను, టీమ్ స్పిరిట్‌తో పనిచేయు సహచరబృందముండుటచేతను ఆయన ఇట్టికార్యములు చేయకలిగాడు.

తీసుకొనిపోబడి 1944 సం॥లో విడుదలై స్వస్థానపు గ్రామంలోని ఆబాలగోపాలము ఆయనను వైభవముగా స్వాగతించి గొప్ప సభగావించి సన్మానించిరి.

"ఎన్నడువచ్చునో మదినెన్నడు సంతసమున్ ఘటించునో
యెన్నడు కన్నులున్న ఫల మింపొందు నింగనుగొండ నీతుదో
సన్నుతశీల నిన్నని విచారభరమ్ముగ గ్రసియుంగియున్న మా
కెన్నగరాని హర్షములభించెను తావక దర్శనమ్ముచే"

ఆయనయెడల గ్రామస్థులకుగల అభిమాన గౌరవాలు అయినప్పుడి గురునాథరావుగారు ఆయన జైలునుండి విడుదలయినప్పుడు చెప్పినపై పద్యం సూచించును.

---

# గ్రామ సేవ

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

Breaths there the man with Soul so dead
Who never to himself hath said
This is my own my Native Land

Sir Walter Scot.

మనకు జన్మస్థలాభిమాన మున్నమాట వాస్తవము. మనకేకాదు అనాగరికులైన ఆటవికుని మొదలు అత్యున్నత నాగరికులవరకు యిది స్వభావ సిద్ధమైన గుణము. కాని స్థలాభిమానము సంకుచితము కాగూడదు. అది దేశాభిమానాన్ని మించరాదు.

అలాగే జాతీయాభిమానం, అంతర్జాతీయాభిమానానికి అడ్డురారాదు. అంతర్జాతీయత యంటూ జాతీయులను విసువరాదు.

అట్లాగే దేశసేవ చేస్తున్నామని తలంచి, స్వగ్రామ సేవను విస్మరించరాదు.

ఇవన్నీ పరస్పర దోహద కారణములైనప్పుడే మానవాభివృద్ధికి, ప్రపంచ శాంతికిని కారణ భూతములు కాగలవు.

బ్రహ్మయ్యగారు యీ సంగతి సంపద్యములన్నీ గమనించిన వాడగుటచేతనే దేశ సేవతోబాటు గ్రామ సేవకూడా చేశారు.

ఆయన చదువు మాని గ్రామంలో ప్రవేశించిన తర్వాత ఐకమత్యం కొరకు కృషి చేస్తూ, గ్రామంలో జరిగే ప్రతి సాముదాయక కార్యమునందునూ పాల్గొంటూ ప్రముఖ పాత్ర వహించాడు.

సమష్టి సత్కార్యాలకు చందాలు వసూలు చేయుట, ఖర్చుచేయుట మొట్టమొదటగా మొదలిడిన దాయనే.

ప్రతి గ్రామంలోను రైతులమ్మే వస్తువులు కొలుస్తూంటారు. ఆ కొలిచే మనిషి గ్రామ సమష్టికి పుట్టికింతయని కొంత మొత్తం యిస్తూంటాడు దీనినే కొలగారమంటారు.

ఈ కొలగారానికి ప్రజాస్వామ్య పద్ధతుల ప్రకారం ఒక కమిటీ యెన్నుకొనే పద్ధతి యేర్పాటు జేసి, దాని ద్వారా గ్రామానికి సంబంధించిన దానధర్మాలు, రోడ్డు

మరమ్మత్తులు, యితర ప్రయోగములు, సక్రమంగా జరిగే ట్లు యేర్పాటు చేశాడు.

ఘంటశాలకు నడుమ పుల్లా పుల్లా, గుండికాలువ, గుండేరు, అనే మూడు కాలువ లున్నవి. వెల్లనాటి కోస్తే ప్రతి రోజూ పశువులూ, మనుష్యులూ ఆ కాలువలు దాటి వెళ్ళాలి. అవి బురద బాడితో నిండి వుంటవి. అందువల్ల స్త్రీలు, పశువులు, మనుషులు యాతన పడాలి నిత్యం.

ఈ భాధ నివారణకు బ్రహ్మయ్యగారి తండ్రిగారు, అరునదియేండ్ల క్రిందనే ఆందోళన సాగించిన సంగతి పాఠకు లకు పరిచయమే. అప్పటిలవలన ప్రయోజనం కలుగలేదు. బ్రహ్మయ్యగారి కృషి ఫలితంగా రెండు చప్టా లేర్పడ్డవి. తండ్రి తలపెట్టిన పనులు తనయుడు సాధించాడు. ఈ చప్టాల మరమ్మతులకై తిరిగి ఆయన కృషి చేస్తున్నాడు.

ఈ గ్రామంలో పంచాయతీ బోర్డు ది 19_4-1918 సం॥లో యేర్పడినది. దీనికి నేమూరి వెంకయ్యగారు వరుసగా 16 సం॥లు ప్రెసిడెంటుగా నుండుటచేత 'చయిర్మన్' అని ఖ్యాతి గాంచాడు.

బ్రహ్మయ్యగారి పంచాయతీ బోర్డులో 1921 సం॥ లగాయతు 1926 సం॥ వరకు సభ్యుడుగా వున్నాడు. ఆయన సభ్యత్వము వహించిన తర్వాత గుమాస్తాను తీసివేయించాడు. ఆఫీసు ఆయన యింట్లోవుండుటవల్ల ఆఫీసునకు సంబంధించిన పనంతా ఆయనే చూచేవాడు. యింటిపన్ను యువకులగు యితర సభ్యులు వసూలు చేసేటట్లు ఏర్పాట్లు చేశాడు.

ఈ విధంగా బోర్డుఖర్చును తగ్గించుటేగాక ప్రతిపైసా ప్రజలకు వుపయోగపడుటకు అధికంగా తోడ్పడ్డాడు.

ఘంటశాల, ఘంటశాలపాలెం, యీ పంచాయితీలో కలసివుండేవి. 1934 సం॥వరకు ప్రశాంతంగా వున్న బోర్డు కక్షులకు ఆకరమైనది. అని చివరకు ఘంటశాల – పాలెం తగాదాలుగా పెరిగిపోయినవి. పాలెంవారికిప్రథమంనుంచి పంచాయతీబోర్డునందు అయిష్టమే. యీసంగతి సందర్భములన్నీ గ్రహించి పంచాయిబోర్డు ప్రశాంతముగా వుండగలందులకు పాలెమును యిందులోనుండి తొలగింప జేశాడు.

గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు యీ గ్రామంలో 1913 సం॥లో "శ్రీరామమోహన పుస్తకభాండాగార"మను పేరుతో ఒక భాండాగారమును యేర్పరచాడు.

ఆయన కీర్తిశేషులైనతరువాత యిది అంతరించకుండా చూచుటేగాక దీనికి అధ్యక్షుడుగాను, కార్యదర్శిగాను వుంటూ దీని అభివృద్ధికై యెంతో కృషిజేశాడు. నాడు మూడు పుస్తకాలతో స్థాపింపబడిన గ్రంథాలయం నేడు ఇరువదియైదు వందల గ్రంథాలతో విరాజిల్లుచూ ప్రతి సంవత్సరము ప్రభుత్వమువారి గ్రాంటు పొందుతూ వృద్ధిచెందుట ఆయన చేతిచలువే. ♦

---

♦ ఈ భాండాగారమునకు ప్రథమదశలో, యీ గ్రామవుపాధ్యాయులు అధికంగా అన్నివిధాలా సహాయపడ్డారు. ఆయనకు వారితోగల సాహచర్యంవల్ల వారి కష్టసుఖాలు అనుభవమైనవి ఆ ఉపాధ్యాయుల యెడల ప్రేమే వుపాధ్యాయ వర్గము యెడల ప్రేమగా పరిణమించింది. అందువల్లనే అవకాశం చిక్కినప్పుడల్లా వుపాధ్యాయుల కష్టనివారణకు కృషిచేయుట ఆయనకు పరిపాటి.

గ్రామప్రజల, ఆరోగ్య, నైతిక, విద్యాభివృద్ధులకు గాను, ది 2-12-1925 తారీఖున గ్రామసంఘం బ్రహ్మయ్య గారిచే స్థాపించబడినది. గ్రామానికి సంబంధించిన సమస్త వ్యవహారాలు దీనిద్వారానే జరుపుట ఆచారము. దీనికి కార్య దర్శిగాను అధ్యక్షుడుగాను వుండి గ్రామాభివృద్ధికై పాటు బడిరి.

ఈ గ్రామప్రముఖులగు వేమూరి రత్నయ్యగారి కృషి ఫలితముగా ది 19-12-1919 సం॥నాడు పరపతి సంఘము స్థాపింపబడింది. ఆయన పెద్దవాడగుటచేత బహు కార్యని మగ్నుడగుటచేత, గ్రామశ్రేయాభిలాషులగు బ్రహ్మయ్య గారికి ఆయన దీనిని అప్పగించాడు. ఈ సంఘాన్ని వృద్ధిజేసి, బీదరైతులకు అప్పులనిచ్చుటద్వారా తోడ్పడిరి. దీనివల్ల కల్గే, ఆర్థికప్రయోజనమును భాండాగారమునకు వినియోగింప జేసిరి.

పూర్వం ప్రతిగ్రామానికి పశుగ్రాసభూమి వుండేది. దానిని ఘోటకం అని పిల్చేవారు. కాని దానిపేరు గోటకం గో=గోవులు, అటకం=సంచరించేభూమి, అని దానిఅర్థం. ఇతర సాముదాయిక భూములన్నీ జమీందారులు హరించినట్లే యీ ఘోటకాలనుకూడా ప్రతిగ్రామంలోనూ హరించారు.

ఘంటశాల గోటకం 270 యకరాలభూమి దీనిని బ్రహ్మయ్యగారి తండ్రిగారి కాలంలో జమీందారు స్వాధీనం చేసుకోవాలని, ప్రయత్నించడం, ఆయన అడ్డుతగలడం, అది ఆవిధంగా నిల్చిపోవడం పాఠకులకు తెలిసినదే.

ఘంటశాల ఐకమత్యంగా వున్నంతవరకు ఈ ఘోటకం సంగతి యెత్తలేదు జమీందారు. 1934 సం॥లో గ్రామములో కల్లలు యేర్పడ్డవి. ఆ సందుజూచి జంపాల వెంకటేశంగారనే దివాను "అనాది బంజరై, యస్టేటువారికి సంపూర్ణ హక్కు భుక్తములు కల్గి వారి కాపలాలో వున్న భూములో, యస్టేటువారి పర్మిషన్ లేకుండా పశువులను తోలినందుకు 200-0-0 లు నష్టపరిహారము, యివ్వని యెడల కోర్టుద్వారా రాబట్టుకొందుమ'ని 1934-12-4 వ తారీఖున ఘంటశాల, పాలెంలోని 45 మంది పెద్దలుకు లాయరు నోటీసుల నిప్పించిరి.

బ్రహ్మయ్యగారి కృషి ఫలితంగా, గ్రామ ప్రముఖులంతా యీ విషయంలో యేకీభవించారు. లోగడ యీ ఘోటకం కేసుల్లో ధర్మచింతతో పనుచేయుటే గాక, దీని సంరక్షణకై 1921 సం॥లో ఘోటకసంఘము స్థాపించిన వకీలు వల్లూరి సూర్యనారాయణరావుగారి ద్వారా యీ 45 గురు సభ్యుల ఆమోదంతో ఒక్క గ్రామ సంఘ అధ్యక్షుని చేతనే గోటకం గ్రామస్థులదిగాని, జమీందారు కెట్టి సంబంధము లేదని నోటీసు నిప్పించాడు. ఈ సమాధానము వల్ల గ్రామస్థులు ఐకమత్యంగా నుండుట గ్రహించి కోర్టు వ్యవహారములనుండి విరమించిరి.

అట్లా జమీందారు ఆక్రమించకుండా జూచుటేగాక అక్కడక్కడా రైతు లాక్రమించుకొన్న దానిని గూడా, ఆయన గ్రామసంఘ అధ్యక్షత వహించిన తర్వాత ఆక్రమణ తీసివేయించి, చుట్టూ సరిహద్దు దిమ్మలను 1945 లో కట్టించిరి.

ఆయన అధ్యక్షులుగానున్నప్పుడు యీ గ్రామం నుండి పది యకరాల భూమి హైస్కూలుకు మరియు 10 యక రాలు కోడూరు ఇప్పించి గ్రామ సౌభాగ్యమునకు పాటు పడిరి.

ఘంటసాల చాలా పెద్దగ్రామము. 18 వ్రాస్త్ర లో పాయకాపు భూములన్నీ రైతుల చేతికి అధికముగ లింకంపూడి అనే గ్రామం ఘంటసాలకు ఒక మైలు. ఆ భూమిలో అధిక భాగం ఘంటసాల రైతులవే. అది పల్లపు ప్రదేశ మగుట చేత మెరక పైర్లకు అంతగా ప్రయోగించనందున పల్లపు సాగు చేయుటకు చాలాకాలమునుండి కృషి చేస్తూ వుండిరి. కాని ఫలించలేదు. ఈ విషయంలో దాసేపూడి వెంకట్రాయలుగారు ఆయన కుమారుడు సీతారామయ్యగారు పడిన పాట్లు భగవంతునికే యెరుక. మిత్రుడు సీతారామయ్యగారి కోర్కెపై బ్రహ్మయ్యగారీ వ్యవహారములో ప్రవేశించి తగు కృషి చేసి పల్లపు సాగునకు పర్మిషను సంపాదించి గ్రామమునకు తోడ్పడుటతో పాటు అధికోత్పత్తికి కూడా తోడ్పడిరి.

దివి తాలూకా విద్యావంతమైన తాలూకా కాదు. ఇదివరకు యీ తాలూకాలో రెండే హైస్కూళ్ళు. ఇటీవల మరికొన్ని హైస్కూళ్ళు నెలకొల్పబడినవి.

బ్రహ్మయ్యగారి కృషి ఫలితంగా గ్రామస్థులు 10 యెకరముల భూమి 10 వేల రూపాయలు యిచ్చే పద్ధతిని 1946-8-21 వ తారీఖున ఘంటసాలలో మాధ్యమిక పాఠశాల యేర్పడినది. అది మరు సంవత్సరం హైస్కూలుగా అంగీక

రింపబడుటేగాక, ఆయన కృషిఫలితంగా, గోటకములో లక్షరూపాయిలతో గొప్ప బిల్డింగు జిల్లాబోర్డువారు కట్టి నేర్పాటుగావించిరి. వుత్తరోత్తరా దీన్ని వ్యవసాయ కళా శాలగా మార్పించాలని మన రైతుపెద్ద సంకల్పం.

ఘంటశాల పెద్ద గ్రామమైనా, కాంగ్రెసు గ్రామమగుటచేత, స్థానికసంస్థలకు అధ్యక్షులుగానున్న జస్టిసుపార్టి వారు దీని కెట్టి సౌకర్యము కల్పించలేదు.

ఈ గ్రా[illegible] రోడ్డు సౌకర్యములేకపోవుటచేత, ఒకదీవివలెనుండి యితర ప్రపంచముతో సంబంధములేకుండా వున్నది. బ్రహ్మయ్యగారి కృషిఫలితముగా కొడాలినుండి ఘంటశాలకు మూడుమైళ్ళు గల మట్టిరోడ్డు యేర్పడుటేగాక కంకరవేయు ప్రయత్నములు కూడా జరుగుచున్నవి. *

ఈస్టుబ్యాంకి కెనాలు యేర్పడిన తర్వాత దివితాలూకా యావత్తు యిరువేపల పల్లపుసాగు క్రిందికి వచ్చింది. కొడాలి, కొత్తపల్లి, [illegible]పల్లి, ఘంటశాల గ్రామాదులు మాత్రమే మెరక గ్రామాలుగావున్నవి. ఈ గ్రామాలచుట్టూ గుండేరు వుండుటచేత, గుండేరుముంపువల్ల, మెరకపైరులు అధికంగా నష్టపడుచున్నవి. అందుచేత రైతులకోరిక ననుసరించి యీ

* బోర్డుకు సంబంధించిన పనులన్నీ ఆనాటి చట్టాలు, ఈనాటి, బిల్డింగు రోడ్డు పనులన్నీ కూడా, సక్రమంగా జరుగగలందులకుగాను గ్రామ సమిష్టిచే కంట్రాక్టుతీసుకొని పనిచేయుట ఆయన ప్రోత్సాహమువలననూ, పలుకుబడివలననూ జరుగుచున్నవి.

భూములుకూడా యిప్పించుటకు గ్రామాల్లో కలిగిన వ్యత్యాసాలను చేయుటకు ఆయనకృషి యొనర్చినాడు.

దేశసేవతోపాటు యిట్టు గ్రామసు ప్రేమాభివృద్ధికై కృషియొనర్చుటతో ఆయన పేరు ప్రఖ్యాతులతో పాటు గ్రామ ప్రతిష్ఠకూడా పెరిగింది.

ఇది కాంగ్రెసు గ్రామమునని ప్రఖ్యాతి చెందుటచేత ఆయన ప్రభావం పలుకుబడివల్ల యుద్ధకాలంలో అవసరాలు పెట్టె బాధలు యితర ఆఫీసర్లవలన కలిగే యిబ్బందులు లేకుండా పోయినవి.

ఈ విధముగా గ్రామసేవజేసి తన జన్మభూమి ఋణ విముక్తుడైనాడు బ్రహ్మయ్యగారు.

“ఏవూరుజూచినా మావూరుగాదు ఏవార్నిజూచినా ఏవార్నిజూచినా మావాళ్ళు గారు.”

## ఎన్నిక దావా

1923_26 మధ్యకాలంలో శాసనసభా ప్రవేశమును గూర్చి అనేక వాదోపవాదములు జరిగినవి. 1925 సం॥లో జరిగిన కాన్పూరు కాంగ్రెసులో శాసనసభా ప్రవేశము అంగీకరింపబడినది. అందుచేత కృష్ణాజిల్లాకు కాంగ్రెసు అభ్యర్థులుగా అయ్యదేవర కాళేశ్వరరావు, కొల్లిపర సూరయ్యగార్లు నిలిచారు.

కాంగ్రెసుకు సాయంచేస్తానని మొట్టమొదట వాగ్దానం చేసిన అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు తానే పెండ్లికొడుకయ్యాడు. మీర్జాపురం రాజాగారు జస్టిసుపార్టీ తరఫున

నిల్చారు. కట్టమంచి కోదండరెడ్డిగారు స్వతంత్ర పక్షాన నిలిచారు.

సూరయ్యగారు "నీచేతను నాచేతను... అరయంగా నారుద్వారచేత కర్మణశ్లైన్" అన్నట్లు మాటనల్పై వోట్ల తేడాతో వోడారు.

కాళేశ్వరరావు, పిఠాపురం రాజాగార్లు గెలిచారు.

ఆనాడు జమీందారులు ఆడినది ఆట పాడినది పాట. వారు రైతుల రక్తమాంసములను హరించి, చట్టంద్వారా చట్టం చాటునా సంపాయించిన ధనంతో, మాంటుఫర్డు సంస్కరణల నాటినుండి రాజకీయ రంగమును, కలుషిత మొనర్చి ఓట్లను డబ్బుపెట్టికొని ప్రజల జన్మహక్కులను సక్రమముగా చెలాయించుకోనీయక, ప్రజలను అవినీతుల జేసి ప్రజాస్థానముల నాక్రమించి తమ స్థానములను బలపరచుకొని తమ స్వార్థములకై దేశ ప్రయోజనములను బలిపెట్టజొచ్చిరి.

ఆవిధముగనే పిఠాపురం రాజాగారు జిల్లాబోర్డు ప్రెసిడెంటుతో తృప్తినొందక, జమీందార్లకై ప్రత్యేకింపబడిన స్థానమునకు నిలువక, ప్రజాస్థానమునకు పోటీజేసి తన అధికారమును దుర్వినియోగము చేయుటయేగాక ధనం వెదజల్లి జయంగాంచారు. రాజాగారికి 9,000 సింగిల్ వోట్లు వచ్చుట దీనికి ప్రబలప్రమాణం.

అక్రమంగా ప్రవర్తించినవారు జయంపొందటం, నీతివర్తనుడగు సూరయ్యగారు అపజయం పొందటం ఆయనే

మిత్రులగు బ్రహ్మయ్య, కొణాలి అంజనేయులు, పోతులపల్లి గోపాలరావుగార్లకు అమిత విచారము కలిగించింది.

సూరయ్యగారి అపజయం అన్నిటికన్నా కలవరపరచింది అంద రకూ. ఈయెన్నికల్లో బ్రహ్మయ్యగారినే నిలబడమన్నారు సూర య్యగారితో సహా అందరూ. కాని బ్రహ్మయ్యగారు సూరయ్య గారు వుండగా తాను నిలబడనని చెప్పి, తన ప్రాణమిత్రులగు సూరయ్య జయముతోపాటు కాళేశ్వరరావు జయమును కూడా అభిలషించి తన మాతృదేవత అవసానకాలంలో ప్రక్క సమయములో కూడా ఆమెకు సపర్య చేయుటకంటె మాతృ దేశారాధనమే అధికముగా భావించి కృషిచేయుటచేత, సూరయ్యగారి అపజయానికాయన చాలా కృంగిపోయారు.

ఇట్టిస్థితిలో కాంగ్రెసు ప్రముఖులగు పట్టాభి సీతారా మయ్య, కృష్ణారావు, చెరుకువాడ నరసింహం, బ్రహ్మయ్యగార్లు ముందుసంగతి యేమిటని ఆలోచించ సాగారు. అడుసుమిల్లి వారి పార్టీకి చెందిన కొందరు ప్రముఖులుకూడా యీవిషయ ములోనే బందరు వచ్చారు.

ఆసందర్భములో జిల్లాకాంగ్రెసు ప్రముఖులంతా సంప్రదించుకొని మీర్జాపురం రాజాగారిని పడగొట్టడం మీ కర్తవ్యమని యెన్నికల సందర్భములో ప్రకటించారు గదా! లంచాలతో ఆయన గెల్చినట్లు కావలసినంత సాక్ష్య మున్నది. అందుచేత ఆయనమీద మీరు వ్యవహారము జరి పితే మేము సహాకారము చేస్తామని అడుసుమిల్లివారితో బ్రహ్మయ్యగారన్నారు. మీరే వ్యవహరించండి. కొన్ని కార ణాలవల్ల మేము వ్యవహరించ వీలులేదు. మేము తగినసాయం

చేస్తామని వారు వాగ్దానము చేశారు. అందుకు సమ్మతించి సరే నన్నారు బ్రహ్మయ్యగారు. 1927-1-5 మీర్జాపురం రాజా గారిపై పిటీషన్ పెట్టబడింది.

అప్పట్లో మీర్జాపూరు రాజాగారికి బద్ధవిరోధిగా వున్న చల్లపల్లి రాజాగారగు అంకినీడుగారు పట్టాభిసీతారామయ్యగారిని రప్పించుకుని కావలసిన సహాయము చేస్తాను, వ్యవహరించవలసినదని చెప్పారు.

రాజాగారు ఆర్థికసాయము చేయడానికి అండగా నున్నారు. పట్టాభిగారు పట్టుదలతో బాధ్యత వహింప పూను కొన్నారు. బ్రహ్మయ్యగారు, ఆయన మిత్రుడు స్వర్గీయ బొబ్బా వెంకటశేషయ్యగారు పిటీషనర్లుగా నిలబడి వ్యవహరింపసాగారు. స్పెషల్ జడ్జీయగు లక్ష్మణరావుగారు, బందరు వచ్చి విచారణ ఆరంభించారు. కాంగ్రెసుతరఫున వూరూరు తిరిగి అఫిడవిట్లు తెచ్చి దాఖలుచేశారు.

ఆదిలో సాయం చేస్తామని చెప్పిన అడ్డుమిల్లి వారు సాయం చేయకపోగా మీర్జాపురంవారికి అండగా నిలబడి, పిటీషనర్ల తరఫున వచ్చినసాక్షులను యెత్తుకొనిపోవడం తిరగ దీయడంకూడా సాగించారు. బ్రహ్మయ్యగారు ఆయనమిత్రులు కాంగ్రెసు గోత్రులు అనేక కష్టాలు పడ్డారీసందర్భములో.

అప్పట్లో వార్తాపత్రికలన్నీ యీ కేసుసంగతులతోనే నిండేవి. యీ జిల్లాలోనేగాక ఆంధ్ర దేశమందంతటను అలజడి కలిగించిన దీదావా.

విచారణ పూర్తయినది. యీదావాలో వందలాది జనులు సాక్షులుగా విచారింపబడ్డారు. కేసు రుజువైనదను

కున్నారందరు. మద్రాసుహోయి స్పెషల్ జడ్జీగారు రాజాగారి కనుకూలంగా తీర్పుచెప్పటజూచి ప్రజలు విస్మితులైనారు.

జస్టిసుపార్టీ నాయకులగు పానుగల్లు రాజాగారికోరికపై గవర్నరుగారు జోక్యముకలుగజేసుకొన్నందున యిట్లా జరిగిందని వదంతి వ్యాపించింది.

మీర్జాపురంవారికి యెన్నికలలో అయిన అరవై వేలు గాక, యీ వ్యవహారములో మరొక అరవై వేలయినవి. పిటీషనర్ల తరఫున అయిన 20 వేలు, అన్నమాట ప్రకారం అంకినీడుగారిచ్చారు.

ఈ తీర్పునకుముందు మీర్జాపురంవారు అనేకయెత్తులు వేశారు. పిటీషనర్లను లోబరచుకొనుటకు సామ దాన భేద దండోపాయాలన్నీ వుపయోగించారు. బొబ్బా వెంకట శేషయ్యగారికి 15 వేల రూపాయలిస్తామని సంచులు పుచ్చుకొని తిరిగారు. ఆయన చేతులో చిల్లిగవ్వ లేకపోయినా ధనాన్ని కాలదన్ని "దేశాభిమాని" అని చెరుకువాడవారు పెట్టిన పేరును సార్థకం చేసుకున్నాడు. బ్రహ్మయ్యగారికికూడా 15 వేలు యిస్తామని రాయబారాలు జరిపారు. వచ్చినవారికి బుద్ధిజెప్పిపంపారు. పిటీషనర్ల తరఫున పనిజేస్తున్న ప్లీడరు భట్రాజు వెంకటాద్రియుడుగారు, ధనలోభముతో మీర్జాపురం రాజాగారివైపు తిరిగిపోయాడు. యీ రైతుబిడ్డలు కూడా అట్టివారేనని భ్రమించి వుంటాడు జమీందారు.

పిటీషనర్లపై వేసిన పాచికలు పారనందున పట్టాభిగారిపై వారిదృష్టి పడింది. పట్టాభిగారి సహపాఠి మీర్జాపురం రాజాగారి వకీలు ఒకాయన యీపిటీషన్ ఎత్తివేయిస్తే

# తాలూకా బోర్డు సభ్యులు, ఉద్యోగులు.

## కూర్చున్నవారు:

ఎడమ నుంచి—1. కొల్లి శేషయ్యగారు 2. భట్టా జ్ఞానకోటయ్యగారు 3. మహమ్మద్ రసూల్ సాహెబుగారు 4. మద్దాలెంపాటి వెంకటకృష్ణయ్యగారు 5. కావూరి కోదండ రామయ్యగారు 6. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు (అధ్యక్షులు.) 7. శేషింబి హను మంతరావుగారు 8 వేములపల్లి వెంకటగోపాలరావుగారు 9. మండలి రామస్వామి నాయుడుగారు 10. కేపల్లె వెంకటకృష్ణయ్యగారు 11. వెంకటరత్నంగారు.

## నిలుచున్నవారు—1. బత్తిన లక్ష్మీపతిగారు 2. బాబూరావుగారు (ఓవర్ సియర్) 3. గద్దె

1 వ రుస నారయ్యగారు (ఉపాధ్యక్షులు) 4. లక్కావఝుల వెంకటేశ్వరరావుగారు H. C 5. మండవ వెంకటరత్నంగారు 6. వజ్జ రామయ్యగారు 7. చెలసాని వీరయ్యగారు

2 వ రుస 1. తాతా వీరాస్వామిగారు 2. చెలసాని కాకయ్యగారు (గుమాస్తా) 3. అశ్వథాటి రామమూర్తిగారు 4. నరసింహారావుగారు (Inspecter)

రాజాగారిచేత ఆంధ్రజాతీయ కళాశాలకు ౫౦ వేలు సాయం చేయిస్తానంటూ తిరిగాడు. ఈ నీచమైన డబ్బు కళాశాలకు అక్కరలేదు. అవసరమైతే ముష్టి యెత్తి సంపాదించగలనన్నాడాయన.

జమీందారులు అక్రమంగా రైతులవద్ద ధనాన్ని గుంజుతారు. వారికి నానా స్తుతులు చేస్తుండే ధనాపేక్షాపరుల, స్వార్థపరులగు వందిమాగధ బృంద [illegible], వారిని పొంది పెద్దవారినిజేసే రాజా జమీందారుల [illegible] మహత్త్వమాత్రమే తెలుసు. ఇతర ప్రపంచాన్ని కూడా వారు ఆ కాలపు బుద్ధితోనే కొలుస్తారు. త్యాగులైన దేశసేవా నిరతుల ఘనత్త్వము వారి బుద్ధికి అగోచరం.

"అధమా ధన మిచ్ఛంతి, ధనమానేచ మధ్యమాః॥
ఉత్తమా మాన మిచ్ఛంతి మానో హి మహతాం ధనం."

---

## తాలూకాబోర్డు అధ్యక్షత

క॥ తనవారి నెనుటవారిని దనవారిఁ
గనజూచి నేర్చు ధన్యులుచాలన్
ఘనకీర్తుల చే మింతురు సనకాది
మునిప్రసన్న సంపగిమన్నా.

1921 సం॥లో తాలూకాబోర్డు ఎన్నికలు వచ్చినపుడు పోటీలేకుండానే సభ్యుడుగా వచ్చాడు. బందరు తాలూకాబోర్డు పేరుగాని బందరు దివి తాలూకాలు కలసివుండేవి.

ఆబోర్డులో సభ్యులసంఖ్య 24. అందులో ఎన్నిక సభ్యులు 18 మంది. నియమితసభ్యులు ఆరుగురు. ఈసభ్యులలో కాంగ్రెసు వారి సంఖ్య 10. ఈపార్టీకి నాయకుడు బ్రహ్మయ్యగారే. శ్రీ|| శెడింబి హనుమంతరావుగారు మధ్యస్థుడు. మిగతా ఎన్నిక సభ్యులు 7 గురు నామినేటెడ్ సభ్యులు జస్టిసుపార్టీకి చెందిన వారు. జస్టిసుపార్టీలో ప్రముఖులు కాకర్ల శీలం జగన్నాథ రావు, కొల్లిపర వెంకటరమణయ్య నాయుడుగార్లు.

తాలూకాబోర్డు అధ్యక్షతను ఏకగ్రీవముగా జస్టిసు పార్టీ సభ్యుడు ఎన్నుకొనబడుట మంచిదికాదని యెంచి సిద్ధాంతము కొరకు బ్రహ్మయ్యగారు పోటీచేశారు. ఎన్నిక సభ్యులు వోట్లు అధికంగా బ్రహ్మయ్యగారికే వచ్చినను నియమిత సభ్యుల బలంచేత రమణయ్యనాయుడుగారే [illegible] ప్రెసిడెంటు అయ్యాడు. బ్రహ్మయ్యగారు వ్యతిరేక పక్షపు నాయకుడుగా వున్నాడు ఇట్లా నాలుగు అయిదు నెలలు మాత్రమే జరిగినది.

అనంతరం, కృష్ణాజిల్లా విభజింపబడిన తీరున బోర్డు లన్నీ తిరిగి నామినేట్ చేయబడుట తటస్థించింది. యెన్నిక సభ్యులను మాత్రం వుంచి నియమిత సభ్యులను కాంగ్రెసు పార్టీకి అనుకూలంగా ఈసారి వేయుట తటస్థించింది, తిరిగి ఎన్నిక జరిగింది. మళ్ళీ రమణయ్యనాయుడు బ్రహ్మయ్యగార్లకే పోటీ. నియమిత సభ్యులను తిరగ తీయుటకు జస్టిసుపార్టీ వారు విశ్వప్రయత్నాలు చేశారు. కాని, ప్రయోజనం లేక పోయింది. కాంగ్రెసుపార్టీలోవున్న కాపులగు కేవల్లె వెంకట క్రిష్ణయ్యగారిని తిరగ తీయుటకు వ్యతిరేక పక్షంవారు విశేష

కృషిచేశారు. ఆయన కులతత్వముల నతిక్రమించిన కాంగ్రెసువాది. ఆనాడు కాపుల్లోకి ఈ తాలూకాలో ఆయన కాంగ్రెసుప్రముఖుడు. ఆయన కాంగ్రెసులో చేరినందుకు కాపులు యితరులు పెట్టిన కష్టములన్నీ అనుభవించి కాంగ్రెసు ధర్మాన్ని విడువని దేశభక్తుడు. బ్రహ్మయ్యగారంటే ఆఖరివరకు అమిత ప్రేమభావం కలవాడు. అందుచేత ఆయనపై వేసిన యెత్తులు యేమీ పారలేదు. విజయం బ్రహ్మయ్యగారికే లభించింది.

తాలూకాబోర్డు సభ్యులందరిలోను బ్రహ్మయ్యగారే వయస్సులో చిన్నవాడు. ఇంతవరకు అధ్యక్షులందరు, న్యాయవాదులే. బందరు తాలూకాబోర్డు 1911 సం॥లో యేర్పడింది. ప్లీడరగు వేమూరి వెంకటసుబ్బారావు పంతులుగారు చాలకాలం ప్రెసిడెంటుగా వున్నారు. తర్వాత వకీలు వల్లమన్నాటి నరశింహంగారు కొంతకాలం అధ్యక్షులుగా వున్నారు. పబ్లిక్ ప్రాసిక్యూటరగు కేడింబి హనుమంతరావుగారు కొంతకాలం వున్నారు. వీరి అనంతరం రైతుబిడ్డయగు మండలి రామస్వామిగారిని కొద్దికాలం టెంపరరీ ప్రెసిడెంటుగా నియమించారు. పల్లెటూరి రైతులలో ప్రథమ అధ్యక్ష స్థానంవహించిన గౌరవంకూడా బ్రహ్మయ్యగారికే దక్కింది. ఆయన వయస్సున చిన్నవాడైనప్పటికీ, అధిక విద్యావంతుడు కాకపోయినా, స్థానిక పరిపాలనానుభవము లేకపోయినా, అధిక చాకచక్యంతో వ్యవహరించి అందరి మన్ననలకు పాత్రుడయ్యాడు. ఆయన అధ్యక్షకాలము తాలూకాబోర్డు చరిత్రలో కెల్ల గర్వింపదగిన కాలము. పార్టీ పక్షపాతదృష్టితో

కాకుండా, న్యాయదృష్టితోనే వ్యవహరించాడు. ప్రతిరేక పక్షముతో అనవసర తగాదాలకు ప్రోత్సాహమివ్వక అధ్యక్షస్థాన గౌరవమును కాపాడినాడు.

ఆయన ఏపనిలో ప్రవేశించినా సర్వశక్తులను వినియోగించి పట్టుదలతోను దీక్షతోను చేయుట అలవాటు.

జాతీయభాషలలోనే విద్య గరపవలెనని, ప్రభుత్వ వ్యవహారములు దేశీయభాషలలో జరగాలని మన నాయకులు యెంతకాలంనుంచో ఆందోళన చేస్తున్నారు కాని, దేశభాషలకు యిప్పటికీ ఆ అదృష్టం పట్టనేలేదు.

1927 సం॥ లోనే బ్రహ్మయ్యగారు బోర్డువ్యవహారములన్నీ తెలుగు భాషలోనే జరిగిస్తూ వుండేవాడు.

తాలూకాలోని వూళ్ళన్నియు స్వయంగాచూచి వారి కష్టసుఖాలు కనుక్కున్నాడు. ప్రతి పాఠశాల స్వయంగా తనిఖీచేశాడు. నూతనంగా 35 పాఠశాలలను పెట్టించాడు.

బాలికా పాఠశాలలో అవకాశం చిక్కినప్పుడల్లా స్త్రీలనే నియమించాడు.

హిందూ పాఠశాలలో ఆదిఆంధ్ర ఉపాధ్యాయులను మొట్టమొదటగా నియమించినదాయనే. పాఠశాలలను బహిష్కరించడానికి ప్రయత్నాలు జరగగా ఆయా గ్రామములకు వెళ్ళి అస్పృశ్యతా నివారణావశ్యకతను నచ్చచెప్పి, వారిని వొప్పించి, అస్పృశ్యతా నివారణకు పాటుపడ్డాడు.

ఉపాధ్యాయులతో సంప్రదించకుండా పాఠ్యపుస్తకములను నిర్ణయించేవాడు కాదు.

స్కూళ్ళలో ప్రతిదినం వుదయం, నైతికబోధ చేయ వలసినదిగా యేర్పాట్లుజేసెను. మన విద్యావిధానములో నైతికబోధలేనిలోటు అందరు యెరిగినదేకదా.

పాఠశాలలలో ప్రతిశుక్రవారం సాయంత్రం చర్చలు జరుగునట్లుచేసి, విద్యార్థులు జంకుగొంకులులేక మాట్లాడునట్లు చేయుటకు కృషియొనర్చిరి.

ప్రతి బడిలోను జాతీయగీతములుపాడునట్లు యేర్పాటు చేసెను.

ఉపాధ్యాయులందరు ఖద్దరుధారణ చేయవలసిందని సర్క్యులరు పంపుటేగాక వారుతనవద్దకువచ్చినప్పుడు ఖద్దరు ధారణావశ్యకత నచ్చజెప్తూ వుండేవారు. సంచారము వెళ్ళి నప్పుడు హాకింగుచేస్తూ (విక్రయిస్తూ) రాజకీయోపన్యాస ములు యిస్తూ జాతీయోద్యమ ప్రచారముచేస్తూవుండేవాడు.

సైమన్ కమీషన్ మొదటిసారివచ్చినప్పుడు, ఆఫీసు పై నల్లజండా యెత్తుటయేగాక, పాఠశాలలన్నింటిని మూయిం చెను. యీవిధంగా కాంగ్రెసు ఆశయములకు అనుగుణంగా వ్యవహరించెను.

లోగడ మాష్టర్లకు జీతాలు సక్రమంగా యీయక 3 నెలలకొకసారి యిస్తూవుండే అలవాటునుమాన్పించి, ప్రతి నెల సక్రమంగా యిచ్చేటట్లు ఏర్పాట్లు గావించెను.

ఉపాధ్యాయుల ట్రాన్సుఫర్లవలన వారికి అనేక యిబ్బందులు జరుగుతూండేవి. ఒక్కొక్కప్పుడు స్కూళ్లుపాడు పడిన సందర్భములుకూడా లేకపోలేదు యీయన ఆ సంగతి గ్రహించి, మ్యూచుయల్ ట్రాన్సుఫర్లు తప్ప యితరంగా

సిఫార్సులు మాన్పించెను. మాస్టర్లు యిదివరకు తాలూకా బోర్డు అధికారులను జూచి అధికంగా భయపడేవారు. యీయన ఆ అనవసరభయాలను మాన్పి వారిలో ఆత్మ గౌరవాభివృద్ధి పెంపొందించుటకు తోడుపడ్డాడు.

ఉపాధ్యాయులను గుమాస్తాలను సోదరులుగా భావించి, వారి కష్టసుఖాలను గమనించుచు, వారి కర్తవ్యములను సక్రమంగా వహించునట్లు చూచేవాడు. అందుచేతనే ఆయనంటే అధిక ప్రేమ గౌరవాలు యేర్పడినవి వారికి. యిప్పటికి వారు బ్రహ్మయ్యగారి పరిపాలనా సామర్థ్యమును గూర్చి, సౌజన్యమును గురించి చెప్పుతుంటారు.

కొన్ని వ్యవహారములలో తన పార్టీవారుగాని మిత్రులుగాని చెప్పినను, ఆయనకు న్యాయమని తోచని విషయముల మన్నించనందున కొందరికి అభిప్రాయభేదములు కలిగినను క్రమంగా సమసిపోయినవి.

ఆయన కార్యనిర్వహణదీక్షలోని స్వతంత్ర విధానము వలన తమ స్వార్థములు ఈడేరవని కొంతమంది బ్రాహ్మణులు ఆయన కమ్మతత్వము గలవాడని, కమ్మవారు బ్రాహ్మణ దాసత్వము ఆపాదించిరి. కాని కాలక్రమంగా యీనిందలన్నీ నీలాపనిందలుగానే పరిణమించినవి.

ఆయన పరిపాలన దక్షతతోను, సామర్థ్యంతోను, కాంగ్రెసుకు బలయుతంగాను జరిగింది. ఆయన అధ్యక్షుడుగా వున్నకాలంలో ఓటింగువచ్చిన విషయములు రెండుమూడు మాత్రమే. అధికంగా ఏకమత్యంగానే జరిగిపోయినవి. జస్టిసు పార్టీ నాయకులగు నీలం జగన్నాధరావు నాయుడుగారు,

మొదటిపక్ష నాయకుడుగా నుండి గొప్ప ఔదార్యముతో ప్రవర్తించి సామరస్యానికి తోడ్పడిరి.

బ్రహ్మయ్యగారు జిల్లాబోర్డులోకూడా అనధికార రీత్యా సభ్యులు కాంగ్రెసుపార్టీకి డిప్యూటీలైరు. జిల్లాబోర్డు వ్యవహారములలోకూడా ప్రాముఖ్యమైన విషయములు ఆయన సలహా సంప్రతింపులతో జరిగేవి.

ఆ॥ కార్యసిద్ధి పొందు కాలంబు
దేశంబు నరసి బుద్ధి ...
నాటి ...
ఉత్సాహము ప్రయుక్తి చేయుదుగ యుక్తోచితముగ.
—భారతం.

---

# నల్ల జెండాలు

"తనివిసిరే వేల్పు లంబుధిరత్నములుచేత
వెరచిరే ఘోరకాకోల విషముచేత
విడిచిరే యత్నమమృతంబు వొడము దనుక
నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు."

— భర్తృహరి.

1929 వ సంవత్సరాంతమున కాన్పూరులో జవహర్‌లాలు అధ్యక్షతను కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము ఆమోదించింది. 1930 సం॥ జనవరి 26 వ తేదీని సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవముగా నిర్ణయింపబడుటచే

దేశమంతటా ఆరోజున సభలు చేసి సంపూర్ణ స్వరాజ్య తీర్మానము చేయబడెను. [illegible] ప్రజల ఉత్సాహపరంపరలు [illegible] ఉత్సాహము దేశమంతా వ్యాప్తి మయ్యెను.

ఇంతలో బ్రిటిష్ ప్రభుత్వపు [illegible] బట్టబయలైనది. లోకవంచన కొరకు గవర్నరు ప్రజా సంఘములకు స్వాగత పత్రములు పుచ్చుకొని దేశము తమ పక్షముననే వున్నదని ప్రకటించుటకు సంచారము బయలుదేరెను. ఆ సంచార సంద ర్భములో నల్లజెండాలు ప్రదర్శించి తమ వ్యతిరేకతను కన పరచవలసిందని కాంగ్రెసు ప్రముఖులగు [illegible] నారాయణ రావు, ఆత్మకూరి గోవిందాచారిగార్లు పత్రికలలో ప్రకటించిరి.

లోగడ జిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షులుగా వున్న బ్రహ్మ య్యగారిని 1930 సం|లో తిరిగి అధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నుకున్నారు. 1930 సం॥ ఫిబ్రవరి 1 వ తేదీని ఘంటశా లలో జరిగిన కృష్ణాజిల్లా సహకార సభకు ఆయన ఆహ్వాన సంఘాధ్యక్షత వహించాడు. నరసింహదేవర సత్యనారాయణ గారు అధ్యక్షత వహించారు. ఆ సభను పురస్కరించుకొని ఆ తేదీనే జిల్లా కాంగ్రెసు సభకూడా జరిగింది. ఆ సభలో ఫిబ్రవరి ౮ వ తారీఖున బందరు వచ్చు గవర్నరుగారికి నల్ల జెండాల ప్రదర్శనం చేయవలసిందని యేకగ్రీవముగా తీర్మా నము చేయబడినది.

ఆ సభకు హాజరుగాని పెద్దలగు పట్టాభి, కృష్ణారావు గార్లు ఈ తీర్మానం తొందరపడి చేశారన్నారు. అయినా వేడి రక్తంగల యువకులు తీర్మానం ప్రకారం ఆచరించుటకు

నిశ్చయించుకున్నారు. ఆంధ్రదేశమంతటా నల్లజెండాల ప్రదర్శనం చేయవలసిందని ప్రకటించిన ఆత్మకూరి గోవిందాచార్యులు, మోతే నారాయణరావుగార్లు పలూరు గవర్నరు వచ్చినపుడు మూలకు పోవడం లజ్జాకరమగు సంగతి. కాంగ్రెసు స్వాధీనములోవున్న బెజవాడ మున్సిపల్ కౌన్సిలు, గోదావరిజిల్లాబోర్డు సైతం స్వాగతాలిచ్చుట అవమానకరం. యివ్వని సంస్థ ఒక్క గుంటూరు మునిసిపాలిటీయే. గుంటూరు తన గొప్పతనాన్ని అవిధంగా నిలబెట్టుకున్నది. ఆంధ్రదేశంలో నల్లజెండాల ప్రదర్శనం జయప్రదంగా జరిగింది. ఒక్క బందరులోనే. జరపబడ్డాయి గుంటూరు లడాయి అనేదానికి భిన్నంగా బందరు లడ్డులకేగాక లడాయికిగూడా గొప్పదని ఖ్యాతి గాంచింది.

సీతారామయ్యగారు కాంగ్రెసు వర్కింగుకమిటీకి వెళ్ళారు. ఫిబ్రవరి 7 వ తారీఖున బహిరంగసభ జరిపి, వ్యతిరేక ప్రదర్శనములో పాల్గొనవలశిందని ప్రజలకు హెచ్చరిక చేయబడింది. ఆరాత్రి జిల్లాకలెక్టరు, బందరు మునిసిపల్ ఛైర్మన్ సీలం జగన్నాథరావునాయుడుగారు ప్రదర్శనం మానవలసినదిగా బ్రహ్మయ్యగారివద్దకు కబురుచేశారు. తాము నిశ్చయించుకున్న ప్రకారం నడచుటతప్ప అన్యథా ప్రవర్తించమని ఆయన తిరిగి కబురుచేశాడు. దీనిపైన రెండేసి సంవత్సరాలు కఠినశిక్షకు తయారుకావలసిందని బెదరించాడు కలెక్టరు. వారు బెదరించినకొద్దీ వీరు బిర్రబిగిశారు.

అనుకున్నట్లుగానే మరునాడుదయం జిల్లా కాంగ్రెసు అధ్యక్షతక్రింద పెద్దవూరేగింపు బయలుదేరింది. ముఖ్యులుగా

న్నన్న 11 మందిని అరెస్టుచేశారు. మరి 20 మందిని ప్రాసిక్యూషన్ చేసి తర్వాత విడిచిపెట్టారు. అరెస్టయినవారిమీద కేసు పెట్టారు. 1 గొట్టిపాటి బ్రహ్మయ్య 2 వల్లూరి రామారావు 3 కొడాలి ఆంజనేయులు 4 ముసుగంటి వెంకట్రావు 4 తల్లాప్రగడ రామారావు 6 బొబ్బా వెంకటశేషయ్య 7 అన్నే వెంకటరత్నం 8 బొబ్బా ఆదినారాయణమూర్తి 9 బొబ్బా రంగారావు 10 వడ్లమూడి సత్యనారాయణ 11 గూడూరు వెంకటచలం. యీ పదకొండుమంది ముద్దాయిలుగా నున్నారు.

గూడూరు వెంకటచలం క్షమాపణచెప్పుటచే విడిచి పెట్టబడ్డాడు 8. 9. 10 ముద్దాయిలు డిఫెన్సు పెట్టుకున్నారు. మొదటి యేడుగురు తాము డిఫెన్సు పెట్టుకోతలచలేదన్నీ, అందుచే ప్రత్యేకముగా విచారించి శిక్షించుకోవలసిందని నిర్భయంగా కోరారు. కాని డిప్యూటీకలెక్టరు అట్లా వీలు లేదని 6 వారాలు విచారించి 1930 సం॥ మార్చి 15 వ తారీఖున 6 వారాలు శిక్ష, సంవత్సరం సెక్యూరిటీ శిక్షను విధించుచు సెక్యూరిటీ యివ్వని పక్షమున 1 సంవత్సరము శిక్ష అనుభవించేలాగు తీర్పుచెప్పెను

ఈ జెండాల ప్రదర్శనములో మహాకవిచిత్రము జరిగింది. వీరి నల్లజండాలవూరేగింపు గవర్నరుదగ్గరకు పోలేదు. వీరు మధ్యలోనే అరెస్టుచేయబడి ఆపివేయబడిరి. కాని గవర్నరుగారు బందరు పురమందిరములోనికి కారులో వస్తూండగా "గవర్నర్ గో బేక్, గవర్నరు గో బేక్" అనే నినాదాలనిస్తూ ప్రజలు నల్లజండాలనుకూడా ఆయన కారుపైకి

ఎగరవేసిరి. యిట్లాఎగరిన నల్లజండాలలో పిన్నమనేనివీరయ్య గారి జెండా గవర్నరుగారి అంగరక్షకుని వడిలో పడినది.

యెంత పోలీసుబందోబస్తుచేసినా, యిసుమాటిగా నల్ల జెండా వారికి ముట్టింది. తర్వాత గవర్నరు అంగరక్షకుడు బందోబస్తు బాగుండలేదని చీవాట్లువేశాడు. ఒకవేళ బాంబు వేసినా యింతేగదా అని మందలించాడు. కాక మండిప డ్డాడు. వారుమాత్రం తక్కువబందోబస్తుచేశారా? బెజవాడ లగాయితు బందరువరకు స్టేషన్లకు కొనసాగుతున్న పోలీసుల కాపలాపెట్టించారు. జిల్లాలోని పోలీసుసిబ్బందినంతా బందరు పంపి బందోబస్తు బాగాచేశారు. సముద్రఘోషను మరి పించు యీ జనఘోషను ఈ రక్షకభటులు అడ్డగలరా ? ఈ జెండావీరులు సబ్ జైలులోనుండగా మద్రాసునుండి ఆంధ్ర కేసరి రెక్కలగట్టుకొనివచ్చి ముద్దాయిలందరిని పరామర్శించి ఆంధ్రదేశములో జీవమున్నదని మీరు తెలియచేసినందుకు నేను అభినందనలు అందజేస్తున్నానన్నాడు. ♦

తొందరపడ్డారని మందలించిన కృష్ణారావుగారు, సమయమొచ్చేసరికి నల్లజెండాతో తయారయ్యారు. మాని కొండ సత్యనారాయణ శాస్త్రిగారుకూడా నల్లజండా పుచ్చు కొని చెదరుబెదురు లేకుండా వచ్చి శాసనోల్లంఘనచేయ

---

♦ "ఆయనయందు మూర్తీభవించినది గాంధీతత్వము, అది మరియొకరిలో కొంత కన్పించినా, వారిపై కొంత మమకారము ఆయనకు కలుగుతుంది. రాజకీయ ఖైదీలంటే, విప్లవకారులంటే, దెబ్బలుతిన్న వాలంటీర్లంటే ఆయన హృదయం లేచివస్తుంది." అని అంటాడు ఆచార్య రంగాగారు. చిత్రగుప్త 15-2-39.

ప్రయత్నించగా బ్రిటిషువ్యాపారులు నేను జిల్లాధికారాధ్యక్షుని పట్టాభిగారితో చెప్పినాను. మహాత్మాగాంధీగారి ఆజ్ఞాపూర్వ శాసనోల్లంఘన సత్యాగ్రహమునకు జిల్లాపరిషత్తు తయారు చేయవలసిందని చెప్పగా ఆయన సుశిక్షిత సైనికునివలెనురలి వెళ్ళెను.

మహర్షి సాంబమూర్తిగారు యేలూరు పౌరులు తమకిచ్చిన సన్మాన సమావేశములో ఈ జండావీరుల సాహసమును ప్రస్తుతించిరి.

తొందరపడ్డారని మందలించిన మన పట్టాభిగారుకూడా అనంతరం దీని ప్రాముఖ్యం గుర్తించారు. నల్లజెండాల కేసు వుప్పుసత్యాగ్రహ ప్రచారము చేయుటకుండా తోడ్పడిందని శ్లాఘించారు.

"దేశగర్వము దీప్తిజెందగ
దేశచరితము తేజరిల్లగ
దేశమరసిన ధీరపురుషుల
తెలిసిపాడర తమ్ముడా" —రాయప్రోలు.

ఈ నల్లజెండాల కేసు తీర్పునుగురించి కృష్ణాపత్రిక సంపాదకీయములలోని కొన్నిభాగములు గమనించిన నాటిస్థితి దాని ప్రాముఖ్యము ద్యోతకం కాగలదు.

## నల్ల జెండాలు

"బందరు డిప్యూటీ మేజస్ట్రేటు తీర్పు ఏమాత్రము ఆశాభంగకరముగ లేదు. శిక్ష మొదటినుండియు అనుకొనిన సంగతియే.

గొట్టిపాటి బ్రహ్మయ్య, శేషయ్యగార్లవంటి సత్యవ్రతులు దుండగీడులని ఇన్స్పెక్టర్లు రిపోర్టుచేసిన చాలును. వారిని బద్మాషులుగ నిరూపించి దొంగల గుంపులో జేర్చకతప్పదు. [illegible]లు, ప్రొసీజర్లు, సెక్షనులు, వారి చర్యల ననుసరించవలసిన [illegible] [illegible] కేసు క్రమము కట్టుబడి యుండనక్కరలేదు. పోలీసువారి చర్యలు శాస్త్రవిరుద్ధములైనవియున్నా న్యాయవాదులు గొంతుకలు చించుకొందురు గాక! కేవలము నిష్ప్రయోజనము. వారి వాదమును విను న్యాయమూర్తి యెవ్వడు?........

కాని ఈ న్యాయస్థానముల కతీతమైన [illegible] [illegible] ఘోషించుచు సబర్మతీ తీరమున మహాత్ముడు రణభేరి మ్రోగించుచున్నాడు. అయ్యది సకల దాస్య శృంఖలములను విచ్ఛేదింపగల రణభేరి. ఆ సత్యము ఎడల ప్రజలకుగల భయ మోహములను పటాపంచలు చేయగల రణభేరి. మిలిటరీ శతఘ్నులను సహస్రఘ్నులను నిస్తబ్ధము చేయగల రణభేరి. ప్రజా పీడకరములగు చట్టములను నిబంధనలను చూర్ణముచేసి ఆత్మయొక్క అప్రతిహత అఖండిత శక్తిని దిగ్దంతములకు జాటగల రణభేరి. ఈ ప్రభుత్వ విధానముపైనను, ప్రభుత్వోద్యోగుల యెడలను ప్రజలకెట్టి యనురాగము లేదని సత్యమును ప్రకటింప సాహసించిన పౌరులకు ప్రస్తుతము జైళ్ళు శరణ్యములు కానచ్చును. శాంతి పేరట పౌర స్వాతంత్ర్యములు నిరోధించి సత్యవ్రతులను బందిఖానాకు బంపిన కపటనాటకులు మిత్రులలో లేక, ప్రజల దారిద్ర్య దుఃఖసూచకముగ నల్లజెండాలను ప్రదర్శించి జైళ్ళకు నడచిన సత్యసంకల్పులు మిత్రులలో, వ్యాధిముదిరి విమమించిన పిమ్మటగాని బోధపడదు. ఈ పోలీసు శాసనముల

శంటే, అత్యద్భుతమైన, అప్రతిహతమైన ధర్మ రాజ్యము, శాంతి సంస్థాపన నొనర్చగల రణభేరి మ్రోగుచున్నదనే శాంతి సైన్యదళములు ప్రాంత ప్రాంతములల ఎట్లుద్భవిల్లుచున్నవో తిలకింపుడు. మహాత్ముని మహాధ్వర దీక్షక్రింద నుపక్రమింప బడిన ఈ విశ్వామిత్ర యజ్ఞమున బాల్గొనుటకు సకల రాజధాను లెట్లు త్వరపడుచున్నవో ఆమంగళ వాద్యముల నాలకింపుడు. సత్యాగ్రహులారా! భరతఖండమున మీకు తావు లేదు. రండు. రండు అదె జైలు కవాటములు చేతులు తెరచుకొని మిత్రుల వలె ఆహ్వానించుచున్నవి. గొట్టిపాటి బ్రహ్మయ్య, బొబ్బా వెంకటశేషయ్య ప్రభృతులు ధన్యులు. వారప్పుడే జైలు ఆలింగనమున స్వాతంత్ర్యామృతమును గ్రోలుచున్నారు. కాన వారిజిల్లా వారి వెంట నంటియేయున్నది. వందలకొలది యువకులు బ్రహ్మయ్యగారి పదాంకానుసరణమున నడుచుటకు మూటముల్లె కట్టుచున్నారు".

—కృష్ణా పత్రిక, మార్చి 22 వ తేది 1930

కృష్ణా పత్రిక పేర్కొనినట్లు అనంతరం వెంటనే ఉప్పు సత్యాగ్రహం జరిగి వేలాదివేలు కారాగారాలు నింపటం సర్వజన విదితం. అందుచేత కృష్ణాపత్రిక అన్నట్లు బ్రహ్మయ్య గారి పదాంకానుసరణమే జరిగింది.

# రైతు ఉద్యమము

"ఈ భూతములపై ఏమానవుడైనా తలఎత్తుకొని తిరుగుట కధికారమున్నయెడల ఆతడు రైతు. రైతే ధనము నకు మూలపురుషుడు. ఉత్పత్తిదారుడు. ధాన్యలక్ష్మికి పీఠము. తదితరులందరు వానిని ఆశ్రయించుకొని బ్రదుకు పరాన్న భుక్కులు" —పటేల్.

భరతఖండంలో అనేక ఋషులు, కవులు, గాయకులు, వీరులు, జన్మించారు. వారిని భారత జాతి బహువిధాల కీర్తించి పూజించింది. వారికి గుళ్ళుగోపురాలు కట్టింది. గ్రంథాలు వ్రాసి వారికీర్తి నలుదిశలు వ్యాపింపజేసింది.

కాని కష్టించి తమ స్వేదబిందువులచే ఒకగింజకు పది గింజలు పండించి జాతివృక్షానికి మూలకందములైన పంట కాపులను మనసార ప్రేమించలేకపోయింది. ఎంతసేపు జాతీయ వృక్షఫల పుష్పముల ననుభవించి దానికి కారకులైన కర్షకు లను విస్మరించింది.

మనదేశం తలయెత్తవలెనంటే మన కళాకౌశలము, విద్యాసంస్కృతి ఆర్థికసంపత్తి, ఆధ్యాత్మిక సంపద అభివృద్ధి గాంచవలెనంటే మనభూములు పండాలి. మనగ్రామాలు ధన ధాన్య సౌభాగ్యాలతో తులతూగాలి. మన పల్లెలు పచ్చతో రణం, నిత్యకళ్యాణానికి నిలయమవ్వాలి.

కట్టగుడ్డ, తినతిండి లేని గర్భదరిద్రుడు తన జాతీయ రథాన్ని ఎలాలాగగలడు? మన ఆర్థికసంపత్తికి, ఇంతేకాదు మన సకలసంపదలకు ప్రాణము పంటచేలు అన్నసంగతి మన

పవిత్రము గోచరిస్తున్నది. మనవారికి అంతా గంగా సరస్వతీ నదీప్రాంతాలలోని కావ్యలక్ష్మి విహారము విద్యగానమే గద! మన కళలు, సంస్కృతులు ఆ పావన నదీతీరాలలో జనితములే గద!

నేటికిని నూటికి ఎనభైమంది వ్యవసాయంవల్ల జీవిస్తున్నారనే నిత్యసత్యాన్ని గ్రహించలేకపోయారు. మన వ్యవసాయ పరిశ్రమ వృద్ధిపొందనిచో మన గృహపరిశ్రమలు పునరుద్ధరణ కానిదే దేశసంపద అభివృద్ధి పొందజాలదని మన నాయకులు గ్రహించలేకపోయారు.

మన పాడిపంటలు మనకుటీర పరిశ్రమలు అభివృద్ధి పొందవలెనంటే మన కర్షకుల కష్టనష్టాలు నివారించి వారిని అభివృద్ధి పంథాకు రప్పించాలి.

ఈసత్యాన్ని గ్రహించి పదదళితులైన కర్షకుల కష్టనష్ట నివారణకై కంకణము కట్టుకొని వారిని కంటికి రెప్పవలె కాచుచు, వారిక్షేమానికై నిరంతరము కృషిజేసింది బాపూజీయే.

గాంధీమహాత్ముడు రాజకీయ రంగమందవతరించక పూర్వము భారత స్వరూపమును గ్రహించినవారే లేరు. భారతదేశమంటే గ్రామము, గ్రామమంటే రైతు. రైతు కష్టనివారణయే భారతదేశ కష్టనివారణ యని కనుగొన్న సత్యశోధకుడాయనే. ఈసత్యాన్ని గ్రహించి లోకానికి చాటినది, బాపూయేజీ.

బాపూజీ బారిష్టరై యుండికూడా కోర్టులో తనవృత్తి "వ్యవసాయము, నేత" అని చెప్పుట గమనింపదగిన

విషయము. ఆయన అట్లు చెప్పలేగాదు. ముమ్మూర్తులా ఆయన రైతు. ఆయన భారత కర్షకకోటికి ప్రతినిధి. ఆకోటానుకోట్ల రైతాంగముయొక్క వ్యక్త అవ్యక్త వాంఛలకు ఆయన ప్రతిబింబము. ఆయన మామూలు రైతు కానియాటు వాస్తవం కాని కోట్లకొలది కర్షకుల వృత్తమూర్తి.

బాపూజీని బహువిధాల భావించారు. కాని అసలైన విషయమేమంటే ఆయన అచ్చంగా ఒక పెద్దరైతు. అన్ని విషయాలు ఆయన రైతుదృష్టితోనే చూచేవాడు. దేశానికి సంబంధించిన కొన్నివిషయాలలో రైతు ప్రవర్తించే అంథత్వాన్నే ఆయన ప్రదర్శించాడుకూడా. ఆయన అసలైన రైతువలె ప్రకృతిసాన్నిధ్యంలో వుండుటకు అధికంగా కోరేవాడు. ఆయనదంతా కర్షకదృక్పథమే.

కర్షక ప్రధానమైన భారతదేశములో ఆయనే ప్రథమ ఆధునిక కర్షక రాజకీయవాది. ప్రభుత్వముమీదగాని చివరకు కాంగ్రెసుమీదగాని ఆధారపడక, కేవలము స్వయంసహాయముమీదనే ఆధారపడవలసినదని, ప్రబోధించిన ప్రబోధకుడు బాపూజీయే.

యదార్థభారతస్వరూపము గ్రామములయందే కాన్పించునని, వ్యవసాయదారు దానికి కేంద్రము, కీలకము అని, రైతునకు సంబంధములేని యే స్వాతంత్ర్యపథమునకుగాని, పనికిగాని అర్థమే లేదని, భారతజాతీయతత్వ ప్రథమసూత్రమును ప్రథమంగా మహాత్ముడు మన దేశంలో ప్రకటించెను. ఈ సూత్రాన్ని అక్షరాల అమలులో పెట్టటానికి తమ జీవితాలను ధారపోసిన వారిలో మగన్‌లాల్‌గాంధీ, సర్దార్‌పటేలు

ఆచార్య రంగాగార్లు ముఖ్యులు. గురువు సూత్రాలు సృష్టిస్తే వాటిని ఆచరించు పద్ధతులు కనుగొని జీవితాల నర్పించారు శిష్యులు. అందులో వల్లభాని, రంగాలకు మహత్తర సదుపాయము కలసివచ్చింది. వారు స్వతహా రైతుబిడ్డలు. అంతే కాక బాల్యంలో వారు వ్యవసాయకులు. అందుచేత వారికి భూస్వాములతో అన్నివిధాల సంబంధముండుటచే, వారి కర్షకాభిమానము అధికమైనది

రైతునాయకుడైన ఆచార్యరంగా కిసానోద్యమనిర్మాత. ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం 1928 సం॥లో, బాపినీడుగారి సహాయముతో, స్థాపించిందాయనే. ఆచార్యరంగా గారికి సహచరుడుగావుండి, కర్షకోద్యమంలో బ్రహ్మయ్యగారు కృషి చేశారు. అయిదుమహాపాయీలనుండి కృష్ణా వుభయగోదావరి జిల్లాలలో యకరం 1 కి రు. 6-4-0 చొప్పున తీరువ ఖాయ పరచుటకు, ప్రభుత్వమువారు నిర్ణయించిరి. ఆ నిర్ణయం అక్రమమైనదని 1931 సం॥ ఆగస్టులో రీసెటిల్మెంటు ఆందోళన ఆరంభమైనది. ఆచార్యరంగా దీనికి మూలపురుషుడు. బలరామకృష్ణయ్య, బ్రహ్మయ్యగార్లు, కృష్ణాజిల్లాలో అధిక ఆందోళనజేసిరి. ఆసమయంలో బ్రహ్మయ్యగారు ఆచార్యరంగా గారితో కలసి, గ్రామాలవెంటతిరుగుతూ, ప్రబోధంచేయుటే కాక వూరూరా రైతుసంఘాలు స్థాపించిరి. యీ రీసెటిల్మెంటు ఆందోళన సందర్భంలో రైతుసంఘాలు బలపడుటే కాక రైతులలో మంచి జాగృతి కల్గెను.

1931 సం॥లో బెజవాడలో జరిగిన కృష్ణాజిల్లా రైతు సభకు, కార్యదర్శిగావుండి అధికకృషి యొనర్చిరి. యీఆందో

ళనా సందర్భములో జిల్లా సభ లేగాక, తాలూకా సభలు, ఫిర్కా సభలుగూడా చేయించి, రైతులందపూర్వ సంఘటనా శక్తి నేర్పరచిరి.

1931 సం॥ నవంబరు 10 తారీఖున అంగలూరులో జరిగిన ఫిర్కా సభకు ఆయన ప్రారంభకులుగానుండి, వుత్తేజకరమైన వుపన్యాసమును గావించియుండిరి.

ప్రథమంలో ఈ రీసెటిల్ మెంటాందోళనలో కాంగ్రెసు వారు జోక్యము కలుగజేసుకొనలేదు. జిల్లాలోని కాంగ్రెసు పెద్దలందరు మూకీభావము వహించియున్నారనియే చెప్పవచ్చును. బ్రహ్మయ్యగారు కాంగ్రెసువాది అయినప్పటికి, తాను రైతుగాన తన కర్తవ్య నిర్వహణకిందు బాల్గొనుటయే గాక, యేలూరులో జరుగు రాష్ట్ర రైతుసభతో బాటు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యసంఘ సభకూడా జరుపవలసినదిగా ఆయన, కార్యదర్శిని కోరెను. ఆయనకోర్కెననుసరించి, సభ జరుగుటే గాక రీసెటిల్ మెంటుఆందోళనలో కాంగ్రెసుగూడా పాల్గొనుటకు నిర్ణయమైనది. ♦ యీ విధముగా రైతు సమస్యలందు తటస్థముగానున్న జాతీయ సంస్థయగు కాంగ్రెసును గూడ రైతాంగ సమస్యలకు సుముఖముగా నొనర్చి పాటుపడిరి.

ఈ ఆందోళన సందర్భములో, పెక్కు సభలొనర్చుచు రాత్రిందివములు ప్రచార మొనర్చుచుండగా 7-1-1932 సం॥ నాడు పన్నుల నిరాకరణ బోధింపరాదని ఆయనకు 144 వ సెక్షన్ జారీ చేయబడెను. 12-1-1932 తారీఖున పన్నుల

♦ ఈ సందర్భములో డాక్టరు పట్టాభిగారు బ్రహ్మయ్యగారికి అండగావుండి తీర్మానానికి కారకులయ్యారు.

నిరాకరణ బోధించుచున్నాడని అతనిని అరెస్టుచేసి రెండు సంవత్సరములు కఠినశిక్ష వేయిరూపాయిలు జరిమానా విధింపబడెను.

26-11-1936 సం॥లో తాడేపల్లిగూడెంలో జరిగిన పశ్చిమగోదావరిజిల్లా రైతు సభకు అధ్యక్షత వహించి రైతు సమస్యలను గురించి ప్రబోధము చేసిరి.

స్వయంకృషివల్ల వ్యవసాయ సమస్యలను క్షుణ్ణంగా తెలుసుకొన్నవాడగుటచేత గ్రామ పునరుద్ధరణకు కావలసిన విధానాలు గ్రామస్తుల కష్టనష్టాలు ఆయన కధికంగా తెలియును.

అనేక రైతుసభల కధ్యక్షత వహించి, ఆయన చేసిన వుపన్యాసాలు రైతుల కష్టనష్టాలు తెలుసుకొనుటకు ప్రమాణాలుగా నుండుటేగాక తత్పరిహార మార్గములుకూడా చూపబడుటచే శాస్త్రీయ దృక్పథముగల వుద్గ్రంథముగాకూడ వెలువరించ యోగ్యమైనవిగా నున్నవి.

దివి తాలూకా రైతు సంఘ స్థాపకుడై ఆంధ్రరాష్ట్ర రైతు సంఘానికి కొన్ని సంవత్సరాలు వుపాధ్యక్షులుగాను 1936 సం॥ అధ్యక్షులుగానువుండి ఆంధ్రరాష్ట్ర రైతువుద్యమ విజయ సారధులలో నొకడుగా విఖ్యాతి గాంచాడు.

---

# జమీందారీ రైతు ఉద్యమము

"పన్నులభారాలు, పట్టీలంచాలు, పైగా కోర్టుఖర్చులోయి
వీటిభారామెపుడు తొలగునోయి
యీ దుష్టపద్ధతినెపుడు తొలగింతువొ దేవ
మాకొద్దీ జమీందార్ల పొందు" —వెంకట్రామానాయుడు.

"భారతదేశ వడ్డీ వ్యాపారస్తులు; భూస్వాములును యే సమకాలిక, సాంఘీక, ఆర్థిక పద్ధతిలోను లేనట్టి సర్వ భక్షకులు" —బ్రెయిల్స్ఫర్డు.

భారతదేశము కని, విని యెరుగని జమీందారీ విధానాన్ని బ్రిటిష్ ప్రభుత్వం అమలులో పెట్టింది. దానివల్ల భారత రైతు కేవలము దానినుంచె హీనుడైనాడు. ఈపద్ధతి ఒక్క రైతాంగమునే నాశనం చేయలేదు. భారతిజాతి అభివృద్ధినే అరికట్టినది.

ఆచార్యరంగా ఆదిలో జమీందారీ రైతువుద్యమాన్ని ఆరంభించి, జమీందారీవిధానం నశించాలని ప్రథమంగా ఆయన నినాదమిచ్చినప్పుడు అపహాసించిందిది అయున్నిలోకం; ఆయన అనేక కష్టనష్టాలను పాల్పడి, జమీందారీ రైతులలో తీవ్రమైనఆందోళన తీసుకొనివచ్చాడు. తర్వాత కాంగ్రెసు ఆ వుద్యమానికి చేయూతనిచ్చింది.

1937 సం॥ యెన్నికలలో భారతదేశమందంతటా అభివృద్ధినిరోధకులగు యీ జమీందారులు కాంగ్రెసుతో పోటీచేశారు. కాని జమీందారుల నష్టకష్టాలన్నీ అనుభవించిన రైతాంగము యెన్నికలలో వారుపెట్టిన తీవ్ర బాధా

నిరోధములన్నింటిని ధైర్యముతో ఎదుర్కొని కాంగ్రెసు తరఫుననే వోటుచేసిరి. ఆ కృషిఫలితమే నేటి జమీందారీ రద్దు చట్టముగా రూపొందినది.

బ్రహ్మయ్యగారు జమీందారీ రైతుఉద్యమ ప్రారంభకులలో నొకరు. ఆయన స్వయంగా చల్లపల్లియస్టేటుకు సంబంధించిన జమీందారీ రైతు. గనుక జమీందారీ రైతులకుగల కష్టనష్టాలు ఆయనకు అనుభవంద్వారా తెలియును.

నెల్లూరుజిల్లాలోని వెంకటగిరి జమీందారీ బాధలు జగద్విదితము.

ఆంధ్రదేశంలో ఈ జమీందారీ వుద్యమం వెంకటగిరి మునగాల యస్టేటు రైతుల బాధలతో శ్రీ రంగాగారి నాయకత్వమున వెంకట్రామానాయుడు మందేశ్వరశర్మల సాయంతో ఆరంభమై ఆంధ్రదేశమంతటా అభివృద్ధిగాంచి భారతదేశమంతటా బహుముఖముల వ్యాపించి అనేక చరిత్రప్రసిద్ధ పోరాటములను సాగించి రైతువీరుల త్యాగాగ్నిచే దీప్తి వహించి నేటి జమీందారీవిధాన నిర్మూలనమునకు కారణభూతమైనది.

వెంకటగిరి యెస్టేటులో జమీందారీ రైతువుద్యమ ప్రముఖులైన కటికినేని కళ్యాణరావు, వెంకటరమణారావు సోదరులు, రామానాయుడుగార్ల ఆహ్వానాన్ననుసరించి ఆచార్యరంగాగారి ఆశీర్వాదంతో 1921 సం॥ లో వెంబులూరులో జరిగిన వెంకటగిరి జమీందారీ రైతుసభకు బ్రహ్మయ్యగారధ్యక్షతవహించి ప్రబోధించుటేగాక వారి కష్టనష్టనివారణకుగాను సంఘటనాత్మకమగు ఒక కార్యక్రమము సూచించి

రైతులకు ప్రోత్సాహోద్రేకములను పురికొల్పుటతో బాటు వారి ప్రశంసకు పాత్రులైరి.

1935 సం॥లో పోతార్లంక గ్రామంలో దివితాలూకా జమీందారీ రైతుమహాసభ పతాకోత్సవమొనర్చిరి. ఆనాటి రైతుసభలో జెండా ప్రతిష్ఠాపన సందర్భము కొన్ని మతభేదము లకు కారణమయ్యెను. అదివరలో కొందరు రైతుసభలకు కార్మిక చిహ్నమైన సుత్తికొడవలిజెండాను, కొంతమంది కాంగ్రెసు జెండాను వుపయోగిస్తూ వచ్చిరి.

మన బ్రహ్మయ్యగారు పోతార్లంక సభలో ఒక క్రొత్త పంథాననుసరించిరి. కాంగ్రెసు జెండాపైన, రైతుచిహ్నమగు నాగలి, యెద్దులు చిత్రించిన జెండాను ప్రతిష్ఠించి, దాని ఔచిత్యమును ఆసభలో విస్పష్టమొనర్చి, ఒక నూతన పథ ప్రదర్శకులైరి. నూతనమైన యీ మార్పుకు రైతువుద్యమ నిర్మాతలైన ఆచార్య రంగాగారు తమ హర్షామోదములను తెల్పి, బ్రహ్మయ్యగారిని ప్రశంసించిరి.

ఈ సభకు నెల్లూరుజిల్లా రైతునాయకులగు బద్దెపూడి వెంకటనారాయణరెడ్డిగారు అధ్యక్షులుగనుండిరి. ఈ సభను యేదోవిధంగా భగ్నము చెయ్యవలెనని అధ్యక్షుని ఆజ్ఞలను జవదాటి జమీందారీ యేజంట్లు అల్లరిచేయ ప్రయత్నించగా స్థానికపలుకుబడిగల బ్రహ్మయ్యగారు వారిని మార్గానికి అల్లరులనడచి తత్సభావిజయమునకు తోడ్పడిరి.

చల్లపల్లి రాజాగారి సంగతి సర్వజన విదితం. ఆయన స్థానికసంస్థల్లో పాల్గొని కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులుగవుంటూ తమ యెస్టేటు వ్యవహారముల నేమాత్రమూ గమనించక

జంపాల సెంకటేశం అనే ఆయనను దివానుగ నియమించి. సర్వాధికారములు ఆయన పరమొనర్చిరి. ఈ దివానుగారిని గూర్చి యిచ్చట నొక సంగతి చెప్పవలసియున్నది. గుంటూరుజిల్లా పెదనందిపాడు ఫిర్కా పన్నుల నిరాకరణోద్యమ సందర్భంలో యీ మహాపురుషు డిచట డిప్యూటీకలెక్టరుగా నుంటూ, గవర్నమెంటువారి మెరమెచ్చులకై తాను రైతు బిడ్డడై యుండికూడా, రైతులను నానాబాధలుపెట్టిన ప్రముఖుడు. ఇంగ్లీషుగవర్నమెంటువారీయనను రైతుల వణచడానికి వుపయోగిస్తూండేవారు. చూచిరమ్మంటే కాల్చి వచ్చే స్వభావంగల మనిషి.

ఇట్టి ప్రముఖుని పరిపాలన యెంత ప్రజానురంజకంగా వుంటుందో వేరే చెప్పనక్కరలేదు. యీయనకు ఎస్టేటు సాంప్రదాయములు బాత్తుగా తెలియవు. రైతులతో వ్యవహారసంప్రదింపులు యేమీ గిట్టవు. ప్రతిదానికి వ్యాజ్యమే. ఇక ధర్మనిరతి విచారిద్దామంటే, వారు చూచిన పోరంబోకలు ధర్మచెరువులు యెస్టేటుకు సంక్రమించవలసినదే. ప్రతి గ్రామంలోను పార్టీలుపెట్టి తద్వారా యెట్టి కార్యములైనా చేయుటకు వెరవని సాహసవంతుడు. యెస్టేటు బాకీక్రింద రైతు భూములను కొట్టివేయించుకొనుట, ఈస్టుబ్యాంకుకెనాలుక్రింద రైతులభూములకు వచ్చిన నష్టపరిహారములకు అనవసరంగా పేచీలుపెట్టుట, సాధారణంగా పోరంబోకుల్లోను, డొంకల్లోను రైతులెగ్గులు మేసేపద్ధతిని దౌర్జన్యంగా మాన్పించి వేలం వేయించుట మొదలైన కార్యములను నిరాఘాటంగా చేస్తూ రైతులను క్షోభపెట్టసాగిరి. ఈదివానుగారి దుర్భర

పాలనవల్ల ప్రజలలో అసంతృప్తి కలిగి, యెస్టేటు ఒక అగ్ని గుండముగా మారెను.

యిన్ని కష్టము లనుభవించు చున్నప్పటికి నిరంతర కష్ట సహిష్ణుత కలవారువడిన అమాయక రైతు వర్గము బహిరంగముగా యీ అక్రమములను మార్గాన సహించలేక పోయింది. ఇట్టి పరిస్థితిలో బ్రహ్మయ్యగారు యీ దివానుగారిపై పత్రికల ద్వారాను కలెక్టరుగారికి రివిన్యూ బోర్డుకు అర్జీలద్వారాను, ఆందోళన జరిగించి యీ దివానుగారి దుర్భర పాలననుండి 1935 సం॥ రైతులకు విమోచన కల్గించిరి.

## మునగాల పరిష్కారము

ఎస్టేటులన్నీ ఒక యెత్తు మునగాల ఒక యెత్తు. ఈ యెస్టేటు నిరంకుశ ప్రభువగు నైజాం సరిహద్దున నుండుటచేత ఆ పరిపాలనా విధానములో గల దురంతము లన్నియు యిచ్చట మూర్తీభవించి యుండెను యెస్టేటులోని సివిల్ క్రిమినల్ వ్యవహారాలన్నీ జమీందారే దౌర్జన్యంగా నిర్వహించేవాడు. ప్రభుత్వమున్న చిహ్నములే కానవచ్చేవి కావు. అచ్చట జమీందారే సర్వాధికారి. శిస్తులకు రశీదులు యిచ్చేవారుకాను. ఆయన ఆగ్రహానికి గురియైన వాడెవ్వడు ఆ యెస్టేటులో వుండడానికి అవకాశం లేదు

కాంగ్రెసు ప్రభుత్వమును అండగా జూచుకొని జమీందారు దురంతాలను అరికట్టి పోరాటము సాగించాలనే సంకల్పము రైతాంగములో కల్గెను. జమీందారీ రైతు సంఘము స్థాపించబడినది. జమీందారీ అత్యాచారములను గూర్చి సంఘటనాత్మకమైన ఆందోళన ఆరంభమాయెను. ఈ ఆందో

శప ఆంధ్ర రైతాంగము యావత్తు బలపర్చెను.

ఈ తీవ్రాందోళనను గమనించి ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుసంఘం జోక్యం కలిగించుకొని జమీందారునకు రైతులకు మధ్య రాజీ సంభాషణలను ప్రారంభించి రాష్ట్ర కార్యదర్శిగా వున్న మన బ్రహ్మయ్యగారి మధ్యవర్తిత్వమున రైతు సంఘం జమీందారు రాజీచేసుకొన నంగీకరించారు.

అంతట బ్రహ్మయ్యగారు మునగాల వెళ్ళి వుభయుల వాదనలు విని, విచారించి 1933 సం॥ జనవరి 10 న తారీఖున 15 షరతులతో కూడిన ఒక ఒడంబడిక తయారుచేసిరి. ఆ పత్రంపైన రైతుసంఘ నాయకులు, జమీందారుగారును సంతకములు చేసిరి.

జమీందారు సంతకం చేసిన సిరా ఆరక ముందే, దానికి భిన్నంగా ప్రవర్తించుట సాగించాడు. దానిమీద రైతులు సత్యాగ్రహ సన్నద్ధులైరి. అంతట రివిన్యూ మంత్రి గారయిన ప్రకాశంగారు, బ్రహ్మయ్యగార్లు జోక్యం కలుగ జేసుకొని సత్యాగ్రహం విరమింపజేసారు. రాష్ట్ర సంఘము వారు బ్రహ్మయ్యగారి ఒడంబడికను గర్వాత ఆయన యిచ్చిన నిర్ణయమును అమలుజరుపవలసిందిగా ఎర్నేని సుబ్రహ్మణ్యం గారిని పంపించారు. సుబ్రహ్మణ్యంగారుకూడా జమీందారులో హృదయ పరివర్తన కల్గింప శాయశక్తులా కృషి చేశారు. జమీందారుగారు రైతులకనుకూలంగా బహిరంగ ప్రకటనచేసి, ప్రవర్తనలో భిన్నముగా ప్రవర్తింప జొచ్చిరి. అనంతరం కాంగ్రెసుమంత్రులుగ దిగటం జరిగింది. జమీందారుగారు యథాప్రకారం తిరిగి తన నాజీపాలనఆరంభించిరి.

1946 సం॥లో మళ్ళా తిరిగి కాంగ్రెసు ప్రభుత్వము వచ్చేసరికి బ్రహ్మయ్యగారి ఒడంబడిక అమలు పరచమని రైతాంగం ఆందోళనసాగించింది. అంతట రెవిన్యూమంత్రియగు కళా వెంకట్రావుగారు బ్రహ్మయ్యగారి అధ్యక్షతను మునగాల జమీందారుగారు ఎంతవరకు బ్రహ్మయ్యగారి ఒడంబడిక అమలుజరిపాడో విచారించుటకు ఒక కమిటీని నియమించారు.

ఆకమిటీవారు విచారించి జమీందారుగారేమి అమలు జరపలేదని ప్రకటించారు. మునగాల రైతులకు బ్రహ్మయ్యగారి పరిష్కారం ప్రాణప్రదమైంది ♦

ఈవిధంగా పెక్కువిధాల జమీందారీ రైతులకు అండగావుండి అధిక కృషిచేశాడు.

ఈసందర్భంలో జమీందారీ రద్దుబిల్లునుగురించి చర్చించుట ఔచిత్యభంగంకాదనే తలుస్తాను.

ఆచార్య రంగాగారిచే ఆరంభమైన జమీందారీ రైతువుద్యమము జమీందారులను ప్రతిఘటించుటేగాక జమీందారీవిధాన రద్దుకే కారణభూతమైనందుకు ఆనందించతగినది.

1937 లో ప్రకాశంకమిటి జమీందారీ పుట్టుపూర్వోత్తరాలు పూర్తిగా విచారించి, వారు కేవలం శిస్తువసూలుదార్లేగాని, భూమిలో వారికేట్టిహక్కు లేదని, 1802 నాటి శిస్తురేటుకంటె అధికం వసూలుచేయరాదని ప్రకటిస్తూ 18 పర్వాల మహాక భారతం ప్రకటించి ప్రస్తుతిగాంచింది.

---

♦ ప్రకాశంగారు రెవిన్యూమంత్రిగా వున్నప్పుడు ఏర్పడిన జమీందారీవిచారణ కాంగ్రెసు ఉపసంఘపక్షమున సభ్యులుగా వుండికూడా బ్రహ్మయ్యగారు జమీందారీ రైతులకు అండగావుండి అధికకృషి చేశారు

జాతీయవిద్యాప్రచారకుడై, భాషాప్రయుక్తరాష్ట్రవిధ జనప్రణాళికాప్రతిపాదనాగ్రణి వివిధసంస్థలనిర్మాణదక్షుడై, స్వదేశసంస్థాన ప్రజోద్యమసారథియై కాంగ్రెసుకర్ణధారులలో నాయకుడై కాంగ్రెసు చరిత్రకారుడై * మహాస్మృతి భాష్య కారుడై భాసిల్లుచున్న భోగరాజువారు ఆంధ్ర తేజం పెంచారు.

పట్టాభిగారికి ఖద్దరు స్వదేశసంస్థాన ప్రజాప్రభుత్వము అభిమాన విషయాలు. ఆయన లౌకికవ్యవహారకుశలుడు.

# చెరుకువాడ వేంకటనరసింహంగారు

అమాయకత్వాన్ని సూచించే ముఖము, స్వచ్ఛతను ప్రకటించే తెల్లనికళ్ళు, పట్టుదలను సూచించేముక్కు, హృదయ వైశాల్యం సూచించే వక్షస్థలము, లోకశ్రేయము నుత్సహించే శ్రవణపుటములు, త్యాగాన్ని సూచించె ముండనము, జన్మ చేతనే సమత్వాన్ని సూచించే దేహాకారము, వస్త్రధారణ కలవాడు. మన చెరుకువాడవారు.

ఆయన చదివినది స్వల్పము తెలుసుకున్నది అధికం. తెలిపినది అంతకంటె అధికం, గొప్ప వయోజన విద్యాప్రచా రకుడు. ఆయన వుపన్యాసాలు పామరులను పరిణతులను జేసి నవి అయనవంటి వక్తఅరుదు. పల్లెటూరివారికి తెలిసే

---

* రైతులంతా తామురైతుబిడ్డలమని గర్వపడునట్లే పట్టాభిగారుకూడా తాను కరణపుబిడ్డనని గర్వపడతాడు. "పట్టాభీ నీవు మాట్లాడేటప్పుడు నీ పలుకులు ములుకులవలె నుండును గదా, ఇంత పెద్దకాంగ్రెసుచరిత్ర వ్రాశావు. ఎవరిని ఏమీ అనలేదే" అని ఆయనను మహాత్ముడు ప్రశ్నిస్తే "నేను కరణం బిడ్డను కరణం ఎప్పుడూ వ్రాతలో దొరకడు" అని అన్నాడని అనుకుంటారు.



చెరుకువాడ

వెంకట నరసింహంగారు



కొండపల్లి సుబ్బయ్యగారు

భాషలో, ఆ వుపమానాలతో, వారిలో నొకడై చెప్పిన నాడు చెరుకువాడ. చెరుకువాడ వాక్కు చెరుకు రసం గదా!

ఆంధ్ర దేశంలో ఆయన పాదం పెట్టని గ్రామం గాని ఆయన వాక్కు వినని వారుగాని వుండరంటే అతిశయోక్తి గాదు. ఆయన ఆంధ్ర డెమాస్తనీస్ వుపన్యాస కేసరి. ఆంధ్ర దేశాన్నంతా ఉర్రూతలూగించాడు వూరూరు తిరిగి వుపన్యాసాల ద్వారా

ఒక విషయాన్ని గురించి అనుకూలంగాను ప్రతికూలంగాను గంటల తరబడి చెప్పగల ప్రతిభావంతుడు. హాస్యచాతురతలో అందెవేసిన చేయి.

ఆయనవంటి కాంగ్రెసు ప్రచారకులు యెవరున్నారు? ఆనాడు బౌద్ధమత ప్రచారానికి బౌద్ధ భిక్షువులు బయలుదేరి, బుద్ధభగవానుని బోధలు బోధించునట్లు, నరసింహంగారు నడుంగట్టి కాంగ్రెసు మతాన్ని లోకానికి వంటబట్టేటట్లు బోధించాడు. కాళ్ళు బలుపాలు కట్టేటట్లు పాదచారియై ప్రచారం చేశాడు ఆపరివ్రాజకుడు.

ఆయనలో బౌద్ధుల ప్రచారకళ, జైనుల సేవా దీక్ష, వేదవిదుల ధర్మతత్పరత దీప్తిగాంచినవి.

ఆయన నియోగిశాఖలో జన్మించాడుగాని స్వభావము చేత శుద్ధవైదీకి. ఆయన సేవకు శతకోటి యజ్ఞఫలం లభించగలదు. తన జన్మలో, యింగ్లీషు చదువు చదువుటమినహా మరే పాపము చేయలేదని చెప్పే ఛాందసుడాయన!

ఆయన పెక్కు గ్రంథాలు వ్రాయలేదుగాని, వ్రాసినవి రెండూ రత్నాలే. "స్వరాజ్యదర్పణము" కాంగ్రెసు యువకు

ఆయన లోకులను పెంచాడుగాని తాను పెరగలేదంటాడు ఆచార్యరంగాగారు. నేను అట్లాగే అనుకున్నాను. కాని ఆయన పదవులకు పాకులాడ దలచలేదు. అధికారానికి అర్రులు జాచలేదు. ఆచార్యరంగాగారన్నట్లు ఆయన యీనాటి బృహస్పతి. గురుస్థానం కంటె వుత్తమమైన పదవి యేది కలదు! ఆయన కోరింది అదే ఆయన రాణించింది అందులోనే. ఆయనను ఆదర్శనంగా పెట్టుకుంటా పదవీ వ్యామోహమైన ఆంధ్రలోకం? [illegible]మంగాక స్వీయకీర్తి

---

స్థానములోను, జంట కవిత్వములోను ఆయన [illegible] తిరుపతి వెంకటకవులు యుగకర్తలు,

వారి శిష్యులలో ప్రతిభావంతులైన కవులు గలరు కాని, వారివలె తామరతంపరగా శిష్యగణం సంపాదించిన కవులు లేరు.

కాని అందులకు అతీతుడు మన చెరకువాడ. చెరకువాడవారుకూడా శాస్త్రిగారిశిష్యులే. బెజవాడలో ఇటీవల జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు సమావేశసందర్భంలో శిష్యగణం శాస్త్రిగారి పాదపూజ చేయుట జరిగింది. ఆ సందర్భంలో చెరకువాడవారుకూడా పాల్గొని తాము శాస్త్రిగారిశిష్యుల మని సగర్వంగా చెప్పుకున్నారు. అయితే ఆయన కవిత్వం చెప్పగలడా అని పాఠకలోకానికి సందేహం కలుగవచ్చు. వారి గురువుగారు, వారి వుపన్యాస ధోరణికి ఆశ్చర్యపడి ఇదీ ఒక కవిత్వమేనోయ్, మాజువాణీ కవిత్వమని ప్రశంసించారట

ఇంతేగాక కృష్ణాపత్రికలోని ఆయన వచన రచనాప్రాగల్భ్యము జూచి ఆయన కవి గాదని యెవరంటారు? "గద్యం కవీనాం నికషం వదన్తి" అన్నారు పెద్దలు. గేయాల్లోను ఆయన గొప్పవాడే. కృష్ణాపత్రికలోని తుమ్మెదపాటలు, బుడబుక్కలపాటలు చూస్తే, ఆయన కవితామాధుర్యం గోచరిస్తుంది. తిరుపతి వేంకటశాస్త్రిగారివలెనే, శాస్త్రిగారి శిష్యులైన చెరకువాడవారికి శిష్యగణం ఆంధ్రదేశమంతటా వున్నది.

పలుకుబడి ప్రాపకం స్వార్థం కోరుకువారు ఆయనను అనుసరించ గలరా?

ఆయన శిష్యబృందంలో, ప్రహ్లాదునివంటి భక్తులు విశ్వస్తునివంటి ధర్మనిర్ణయనేత్రాలు. అభిమన్యునివంటి వీరులు, అర్జునునివంటి సవ్యసాచులు, దుర్యోధనుని వంటి సంపత్తి గలవారు, అతిరథులు, మహారథులు, ఏకలవ్యులు కలరు. ఆయన ఈనాటి ద్రోణాచార్యులు. ఆయన తన శిష్యగణాన్ని జూచి గర్వపడతాడు. ఆయన కేమి కొదువ? ఆయన కోరేది పెంపే! పదవులు పెరవారికే!

ఆయన శిష్యగణమైనా, నేడు గురుదక్షిణగా భావించి గురువుగారి, ఆదర్శానికై పాటుబడుట ధర్మంకాదా?

నరసింహంగారు గాంధీమహాత్ముడు ప్రవచించిన స్వేచ్ఛాదారిద్ర్యాన్ని వరించి పదవీవ్యామోహంలో పడకుండా, జీవితకాలమంతా అక్షరాలా ఆచార్యుడుగా వుంటూ, శిష్యుల ఉన్నతి జూచి ఉప్పొంగుచూ. వారి నమస్కారాలు స్వీకరిస్తూ "అభివృద్ధిరస్తు" అని ఆశీర్వదిస్తూ 'ధన్యోస్మి' అని అనుకుంటూ ఆనందంలో వుండుటే ఆయన అభిమతము.

ఆయన జన్మతః ఆచార్యుడు. అజాతశత్రువు. పర శ్రేయము, పరోపకారము ఆయనకు పరమ ప్రియము.

"సర్వేజనా స్సుఖినోభవంతు, గోబ్రాహ్మణేభ్యశ్శుభ వస్తు నిత్యం" అనునదే ఆ ఆచార్యుని సంకల్పం.

ఇక నీ గురువులవద్ద బ్రహ్మయ్యగారు యేమి గ్రహించనో తెలుకపరతును, వీరివద్ద బ్రహ్మయ్యగారు చదువు

కున్నది లేదు. వారు చెప్పినదీ లేదు. వారి సామీప్య సాహచర్యభాగ్యములచేత నేర్చుకున్నదే. వారుబోధించాలా? వారి సాహచర్యమే చాలు వివేకవంతునకు. అందువల్లనే వారిని గురువులుగా భావిస్తాడు. తన శ్రేయోభిలాషులుగా యెంచుకొంటాడు.

దూరదూరాల నుంచి వారి వ్రాతల ద్వారా వృత్తి జము నొంది వారిని గురువులుగా భావించేవారు వేలాది వేలుండగా వారి సన్నిహిత సామీప్యభాగ్యముచే వారి శిష్యుడగుట బ్రహ్మయ్యగారి భాగ్యముగాక మరియేమి!

కృష్ణారావుగారు ప్రథమ గురువు. పెద్దగురువు. బ్రహ్మయ్యగారు బ్రహ్మమందిర మందుండి చదువుకుంటున్న రోజులనుంచి వారి దర్శనభాగ్యమేగాక, వారి సామీప్య భాగ్యము వారి పవిత్రవాణి, శ్రవణేంద్రియములద్వారా గ్రోలే మహాభాగ్యం కలదు. వారు ఆదివారం రోజున చేసే ప్రార్థనలో పాల్గొంటూ, ప్రసంగాలు విన్నాడు విద్యార్థిగా. కృష్ణాపత్రిక నాటినుంచి నేటివరకు వేదంగా పఠించే ఘనాపాఠి.

బందరులో ఉన్నప్పుడు దర్బారులో పాల్గొంటూ వుంటుండేవాడు. అందువల్ల పెద్దగురువుగారి ప్రభావము అధికము. నీతికి నిలబడటం, కళాదృష్టికలగటం, కృష్ణాపత్రిక శైలి అనుకరించడం జరిగింది. ఈ గురువుగారివల్లనే ఆచారములందు, సంప్రదాయములందు అభిమానం కలిగింది. రాజకీయంగాగాని, వ్యక్తిగతంగాగాని ఋజువర్తన వుండేనేగాని యేవ్యక్తిగాని వృద్ధికి రాజాలడని గ్రహించాడు. అయనకు

హృదయవైశాల్యం కలిగింది. ఆనాటి బ్రహ్మసమాజ సంస్కారమువల్లనే నేటికిని యేది వ్రాసినా ఓంకారముతోనే ప్రారంభము. పెద్ద గురువుగారి ప్రభావము అట్టిది.

పట్టాభిగారు పుట్టుకతోనే పార్లమెంటేరియన్. వారివల్ల తీర్మానాలు వ్రాయడం, సవరణలు పెట్టటం, ఓటింగు తీసుకొనే పద్ధతి, సభానిర్వహణం, కొత్తవారిని యెరుకపర్చడం, చలోక్తులు పలకడం, వాదించడం, శీఘ్రనిర్ణయానికి రావడం జాగు లేకుండా ప్రతిపని త్వరగా చేయడం నేర్చుకొన్నాడు. ♦

చెరుకువాడవారివల్ల, ప్రచారం, వుపన్యాసాలివ్వటం, సేవాశ్రితం, మొదలగునవి నేర్చుకొన్నారు. వీరి స్వరాజ్య దర్పణం, శాసనసభలు ఆనాటి కాంగ్రెసు ప్రచారకుల కెలా వుపయోగపడినవో, బ్రహ్మయ్యగారికి అలాగే వుపయోగ పడినవి.

---

♦ ఈ సందర్భంలో ఒక సంగతి చెప్పుట అవసరము. బ్రహ్మయ్యగారి మేనమామ సుబ్బయ్యగారు మంచివ్యవహర్త అయినప్పటికి యెప్పుడూ కోర్టుకెక్కని పెద్దమనిషి. లోకులెవ్వరికి తన జన్మలో ప్రోనోటు వ్రాయని భీష్మాచార్యుడు. తగాదామనిషి కాదు. కాని పట్టుదలవస్తే వెరవని నిర్భయుడు. కుటుంబసంబంధమైన సలహాలు చెప్పటంలో మంచిసలహాదారు. పెక్కుకుటుంబాలు మేనేజిమెంటు చేసి అభివృద్ధిలోనికి తెచ్చిన వుదారుడు.

ఇట్టి సుబ్బయ్యగారు మేనల్లునకు మంచిశిక్షణ యిచ్చాడు. నిర్భయంగాను, నిర్మొహమాటంగాను మాట్లాడడం, పెద్దలయెడల వినయవిధేయతలు కలిగివుండటం, సాధ్యమైనంతవరకు యితరులకు సహాయం చేయటం, పొదుపరితనం, జమా ఖర్చులు సక్రమంగా వ్రాయటం. వ్యవహారజ్ఞానం నిజాయితీ మొదలగునవి అలవడచేశాడు. ఆయన గురువెందుకు కాడు? ఆయన శిక్షణకు పట్టాభిగారు మెరుగులు దిద్దారు.

అసలు నేలంటుపడిలించింది చెరుకువాడవారు. నైతిక ప్రభావం కృష్ణారావుగారిది. లోకంలో మెలగడం నేర్చుకున్నది పట్టాభిగారిద్వారా.

అసలు యీ త్రిమూర్తులు స్నేహితులు. వారిప్రభావం వొండొరులపైన బడింది. అట్లాగే ఆ గురుత్రయప్రభావం శిష్యునిపై బడింది. అందుచేత ఫలానా వారివల్ల ఫలాని విషయం వీరికబ్బినదని చెప్పటంకూడా కష్టసాధ్యమే.

వారిది ఒకకూటమి ఆ త్రిమూర్తులు కలసి పనిచేశారు. వారు ఒంటరిగా సాధించినదేదీ లేదు. కృష్ణాపత్రికలోనూ వారు ముగ్గురూ కలిసి పనిచేశారు.

హనుమంతరావుగారుండగా కృష్ణరావు పట్టాభిసీతారామయ్యగారలు కలసి పనిచేశారు. హనుమంతరావుగారు స్వర్గస్థులైన తర్వాత చెరుకువాడ వారితో కలసి పనిచేశారు.

వారి కూటమిని గూర్చి చెరుకువాడవారిట్లా చెప్పుతున్నారు. "పట్టాభిగారు యింజను, నేను లోడ్ వాన్, కృష్ణారావుగారు బ్రేక్ వాన్".

—కృష్ణాపత్రిక 1931–9–26

పట్టాభిగారు వారికూటమిని గురించి యిట్లా అన్నారు. "హనుమంతరావు, కృష్ణారావు, నేను ముగ్గురమూ ఒక కూటం. ఒకమాట, ఒక కార్యక్రమము మీద పనిచేయుచుంటిమి. కృష్ణరావు తత్వవేత్త. హనుమంతరావు కవి. నేను లౌకిక వ్యవహారకుడను. హనుమంతరావు యింజనుడ్రైవర్, నేను బ్రేకువేయు గార్డును, కృష్ణారావు ప్యాసెంజర్, యీ విధముగా, కళాశాల నడుపునప్పుడేమి, పత్రికా ప్రచారమునం

దేము, గ్రంథవ్యాపకమున నందేమి, ముగ్గురము కలసి పనిచేయు చుంటిమి".

"మాకు కుడిచేయివలె కొత్తా శ్రీరామశాస్త్రిగారుండిరి. ఆయన భావవికాసము, వ్యాపారము, వంగభాషాజ్ఞానము సాహసము, భావనలు ఆంధ్రదేశముయొక్క అప్పటిఅభివృద్ధికి పునాదియని చెప్పవచ్చును. ఆంధ్ర భాషాభివర్ధనీసంఘమును స్థాపించిరి. శాస్త్రిగారు ఒక ప్రావిడెంటుఫండు కంపెనీపెట్టి తద్వారాలభించిన తొమ్మిదివేలరూపాయలు కళాశాలకర్పించిరి."

(ఆంధ్రపత్రిక [illegible]-7-1945)

ఈ విధంగా ఒక కూటమిగా పనిజేశారు. దేశాభివృద్ధికి తోడ్పడ్డారు. కృష్ణారావు, పట్టాభి, చెరుకువాడలు ముగ్గురూ మిత్రులైనా వారి మనస్తత్వాలు భిన్నములు.

వారు వారినిగురించి చెప్పుకున్నారు. నేనుకూడా కొంత వారినిగురించి పోల్చి చెప్పెదను.

పట్టాభిగారు సముద్రుడు. ఆయన్నిచూడగానే భయం. కృష్ణరావుగారు గంగానదివలె పవిత్రుడు. ఆయన్ని చూడగానే భక్తి. నరసింహంగారు తటాకంవలె సర్వజన సులభుడు. ఆయనను చూడగానే ఆప్యాయత కలుగుతుంది. *

ఈ త్రిమూర్తుల గుణాలు వారి శిష్యునియందునూ కలవు. ఆయన పట్టాభిగారివలె భయంకరుడు. కాని వాస్తవంగా నరసింహంగారివలె సర్వజనసులభుడు. కృష్ణరావుగారివంటి విమలవర్తనుడు.

---

* Like priests like people.

ఇంతేకాదు. పట్టాభిగారివంటి గడుసరి, నరసింహం గారివంటి అలౌక్యుడు, కృష్ణారావుగారివంటి స్నేహపాత్రుడు.

అందుచేతనే ఆయన నాయకుడు కాలేదు. అనుచరుడుగా ఉండలేదు. ఆయనది తృతీయపంథా!

ఈ గురువుల ప్రభావం ఆయన కొక ప్రత్యేకవ్యక్తిత్వం కల్పించింది.

కృష్ణారావుగారికి ఆయనకు గల కలయిక హృదయ సంబంధమైనది

పట్టాభిగారికి ఆయనకు సంబంధం మేధస్సునకు సంబంధించినది. గురువుగారి మేధస్సునకు ముగ్ధుడయ్యేవాడు శిష్యుడు. శిష్యుని తెలివి తేటలను ప్రశంసించేవాడు గురువుగారు.

నరసింహంగారికి ఆయనకుగల బాంధవ్యం సేవావ్రతమునకు సంబంధించినది.

వీరి ముప్వురలోను బ్రహ్మయ్యగారిని బాగా అర్థం చేసుకున్నది కృష్ణారావుగారొక్కరే. ఆయన బ్రహ్మయ్యగారిని యెన్నడూ శంకించలేదు.

పట్టాభిగారు ప్రతిది మేధస్సుతోనే పరీక్షిస్తారు. ఆయన మేధావి. మేధస్సు అందుకోలేనివిషయం, హృదయం అందుకోగలదని ఆయన వ్రాస్తాడు. ఆసంగతి సర్వజనవిదితం. అందుచేతనే యీ గురుశిష్యులకు అనేకసార్లు అభిప్రాయభేదాలు కలగడం, పోవడం జరిగింది. అలాగే నేడు కలిగినా, రేపు పోకపోవు.

నరసింహంగారితో కలసి యేకనిర్ణయానికి రాలేక పోయినా, వెంటనే కలసిపోవడం కద్దు.

ఆ అజాతశత్రుప్రియ శిష్యవత్సలుఁడు గదా !

ఈ త్రిమూర్తుల ప్రభావం యీమాదిరిగా, యింకా నేను చెప్పలేనివిధంగా పనిచేసింది బ్రహ్మయ్యగారిమీద. ఆయన తన అభివృద్ధికి ఆధారభూతులైన యీ త్రిమూర్తులను సందర్భానుసారంగా నిత్యం స్మరిస్తూవుంటాడు.

నీరము తప్తలోహమున నిల్చి, యనామకమైననశించు, నా
నీరమె, ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు, నా
నీరమె శుక్తిలోఁబడి, మణిత్వముగాంచు సమంచితప్రభం
బౌరుషవృత్తులిట్లధము, మధ్యము, నుత్తముఁగొల్చువారికిన్

---

## ఆయన విశిష్టత

“ చేతబట్టె హాలాయుధము పాశ్రి
చీన తేజము బావుటా గా
గాదె బోయము శుభ్రియశమును
కార్యశూరుడవై ”                    —పల్లెపట్టు.

కాంగ్రెసులో ప్రవేశించిన అనేకులు ఆస్తిపాస్తులు అధికంగానో అల్పంగానో పోగొట్టుకున్నారు. కాని బ్రహ్మయ్యగారు గత 30 సంవత్సరములనుండి కాంగ్రెసులో కార్యకర్తగావున్నా, ఖర్చు అధికంగా చేసినా, జరిమానాలు చెల్లించినా ఆస్తినిమాత్రం పోగొట్టుకొనలేదు. అదొక ఆశ్చర్యకరమైనవిషయం.

ఆయనలో ఆవేశంకంటె ఆలోచన అధికం. అందుచేత ప్రతిపనీ ఆలోచించిగాని ఆరంభించడు. ఇంతేగాక ప్రధానమైన దేదో అప్రధానమైనదేదో గుర్తిస్తాడు.

ఆదాయ వ్యయాలను గమనిస్తాడు. ఆదాయాన్ని మించిన ఖర్చు చేయుట అపచారంగా భావిస్తాడు. అందుచేత అప్పులపాలు కాకుండా; ఆస్తి పోగొట్టుకోకుండా జాగ్రత్త పడతాడు.

పూర్వార్జితం అమ్ముట మహాపాతకంగా భావిస్తాడు. దానిని అనుభవించుటకే తనకు హక్కు-కలదుగాని అమ్ముటకు హక్కులేదని తలుస్తాడు. పెద్దలు ఈ అస్తిని అమ్ముకొనుటకు గాక అనుభవించుటకే ఇచ్చినట్లు తలుస్తాడు. గనుక పెద్దల అభిప్రాయానికి భిన్నంగా ప్రవర్తించిన పాపులనుగుదుము అని భావించుటలో అసందర్భమేమీ లేదు

ఇంతేగాక బహుపొదుపరి. చాలామంది చెడిపోవుటకు కారణం తమ స్థితిగతులు గమనించకుండా ఖర్చు చేయుటమే.

ఆయన పొదుపరితనం, ఒకరిని చేయిచాచడానికి గాని, ఒక లొల్లిపని చేయడానికిగాని ఆయన కవుసరం లేకుండా చేసింది*1

మనదేశంలో స్వంత ఆస్తిలేకుండా, దేశసేవ చేయుట యెంత అవమానకరమో బాధాకరమో ఆయన బాగుగా యెరుగును.

---

* 1. లొల్లిపనులు యీయనకు పనికిరావు అంటారు చెరుకువాడవారు.

కృష్ణాపత్రిక 28-9-32

దేశాన్ని నమ్ముకొని రాజకీయాల్లో తమ సర్వస్వము ధారపోసిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, డాక్టరు సుబ్రహ్మణ్యం, సాంబమూర్తి, ప్రకాశంగార్లు మొదలగువారు పడ్డ అగచాట్లు చాలు మన రాజకీయ జీవనపు వొడుదుడుకులు గ్రహింపజేయడానికి. మనం, మన దేశారాధకులను పోషించే స్థితికి యింకా రాలేదు, *2

అందుచేతనే తన బరువుభారములు లోకులపై వేయక తన దేశహితైక జీవనంపు ఒడుదుడుకు రాకుండా వుండగలందులకే ఆయన అవిఘంగా ప్రవర్తించుట మంచిదని మనం గ్రహించాలి.

ఆయన కాంగ్రెసుసందేశానుసారం సంచరించిన ప్రముఖుడైనా, కొందరివలె స్వగ్రామంలో కాంగ్రెసు వుద్యమాన్ని బలపరచకుండా, దేశాన్ని వుద్ధరించుదామని బయలుదేరలేదు. తన గ్రామాన్ని కాంగ్రెసు గ్రామంగా చేసి, కాంగ్రెసు సందేశానుసారం పనిచేయుటకు, బద్ధకంకణుడై బయలుదేరిన కార్యవాది. ఇంటగెల్చి రచ్చగెల్చిన వీరుడు.

గ్రామంలో యెంత పలుకుబడి వున్నదో, తాలూకాలో అంత పలుకుబడి వున్నది.*

జిల్లాలో పట్టాభిగారి తర్వాత పలుకుబడిగల ప్రముఖుడు.

రాష్ట్రంలో ప్రకాశం, పట్టాభి, రంగాగార్లు మొదలగు పెద్దల అనంతరం, పలుకుబడిగలవాడు.

---

*.2. యీ భావమే, రాజకీయ బాధితుల నిర్వచనములోను భూముల తంపకంలోను, గ్రూపు రాజకీయాభిమానాలు; వేసూళ్ళ చాటుచున్నవి.

* "దివి తాలూకాలో ఆయన మకుటంలేని రాజని చెప్పవచ్చు"

కృష్ణాపత్రిక 26-9-31.

మరొకవిశేషమేమిటంటే ఆయన దేశానికెలా సేవ జేశాడో, గ్రామానికి అలా సేవజేశాడు. ఆయన గ్రామానికి చేసినసేవ పాఠకులకు విదితమే.

ఆయన ఉన్నతపదవులద్వారా కాంగ్రెసు రంగమున కృషిచేసియున్నట్లే రైతురంగమునకూడా కృషిచేసియున్నాడు.

ఇంతేగాక తాను ఏపని చేస్తున్నా వ్యవసాయం వదలకుండా స్వయంకృషిచేయునట్టి రైతు.

---

## ఆయన ఆధిక్యం

"మానవమైత్రి మంగళతంతువె
మంత్రాంగములకు మూలసూత్రమని
సత్యాగ్రహఋషి చాటినపాఠము
యెల్లజాతులును పల్లవిపాడ
యెత్తవోయి నీ జయజెండా
విప్పవోయి నీ ప్రియకాండా." —రాయప్రోలు

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువాదులలో, ఆయనస్థానం యెట్టిదో యెరుకపరిస్తేగాని, ఆయనశీలం, సరసత్వము, ప్రభావము వెల్లడిగావు

కాంగ్రెసులో ఘనతరత్యాగాలు చేసినవారు కలరు. సాహసులు సమధికము. సేవావ్రతులు పెక్కురు. ప్రతిభాశాలురకు తక్కువలేదు. బ్రహ్మయ్యగారు వీటన్నిటిలో వారి

జాతికిచెందిన ప్రముఖుడుగాదు. వీటిలో యేదొక్క విషయంలోను ఖ్యాతిగాంచినవాడు గాకపోయినా, ఆయన ఆంధ్ర యువజన లోకములో ఒక పెద్దగా, ఒక ప్రముఖుడుగా, ఒక ప్రత్యేక గౌరవానికి పాత్రుడైనాడు.

కాంగ్రెసులో పెద్దలును, పిన్నలును గలరు. కాని పెద్దలకు, పిన్నలకు సమానంగా ప్రేమాస్పదుడైన ప్రముఖుడు బ్రహ్మయ్యగారు.

ఆయన కాంగ్రెసు పెద్దలలో పిన్న. చిన్నలలో పెద్ద అందుచేతనేగాదు, సామరస్యభావంవల్ల ఆయన సమధికుడైనాడు.

పిన్నలలో ప్రముఖులు కొందరు ఆయనను పేరుతో పిలువక అన్నగారని పిలుస్తారు. ఆయనకు మిత్రులన్న యేకోపరాంతఃకరణ.

ఆయన రైటిస్టయినా, ఆనాటి రైటిస్టులవలె లెఫ్టిస్టులను మాగ్కన్న వ్యక్తిగాదు. లెఫ్టిస్టుభావా లన్నింటిని అంగీకరించకపోయినా వారి దేశభక్తిని శంకించేవాడు కాడు.

కాంగ్రెసులో ఆయన సేతువువంటివాడు.

ఆంధ్రరాష్ట్రీయ మహాసభ అధ్యక్షత వహించినప్పుడు అతిక్లిష్టపరిస్థితులలో, ఆ సభ దిగ్విజయముగా జరుగుటకు కారణము, రైటిస్టులేగాక లెఫ్టిస్టులగు, రైతు యూతు సోషలిస్టు వర్గములవారికి ఆయనయందుగల అనురాగమే కారణము.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ సెక్రటరీగా యెన్నుకోబడినప్పుడు, అధ్యక్షులగు పట్టాభిగారికంటె హెచ్చువోట్లు

వచ్చుటకు కారణం, ఆయనకు రైటిస్టులేగాక లెఫ్టిస్టులలో కొందరుకూడా వోటు జేయుటయే.

యీ విధముగా, కాంగ్రెసులోగల వివిధవర్గముల యొక్క ప్రేమాభిమానములను చూరగొన్న వ్యక్తి మన బ్రహ్మయ్యగారు.

ఆంధ్రరాష్ట్రములోని అన్ని జిల్లాలలోను విభిన్నవర్గములకు చెందిన ప్రముఖులాయనకు ప్రియమిత్రులు. విశాఖలో పి. ఎల్. ఎన్. రాజు, స్వామిబాబుగార్లు ఆయనను ప్రేమింతురు. తూర్పుగోదావరిలో పళ్ళంరాజు, బిక్కిని వెంకటరత్నంగార్లు ఆయనమిత్రులే. పశ్చిమగోదావరిలో డాక్టరు రంగయ్య, బాపినీడుగార్లు స్నేహితులు గుంటూరులో ఆచార్య రంగా, చంద్రమౌళిగార్ల ప్రేమకు పాత్రుడు. ఇట్లాగే ఇతర రత్రానూ.

తాలూకాబోర్డు అధ్యక్షులుగా నున్నప్పుడు తనకు జస్టిసుపార్టీ ప్రతిపక్షంగావున్నా బోర్డుపరిపాలనలో యెట్టితగాదాలూ లేకుండుటేగాక సభానమావేశములలో వోటింగుతో నిమిత్తంలేకుండా సామరస్యమును సాధించిన సహృదయుడు.

అందుచేతనే, కాంగ్రెసులో తగాదాలువచ్చిన వారికి, రాజీకావాలంటే బ్రహ్మయ్యగారిని కోరుకోండి, తగాదా కావాలంటే నన్ను కోరుకోండి అని ఛలోక్తిగా పట్టాభి గారంటూవుండేవారు.

అందరితోను కలసిపోయే స్వభావము సమన్వయబుద్ధియివే ఆయన అధిక్యత.

ఈ సందర్భములో కృష్ణాపత్రిక ప్రధాన వ్యాసము లోని కొన్ని భాగములను వుదహరించుట సముచితమని తలుస్తాను.

"బ్రహ్మశ్రీ శాస్త్రిగారు యువకులలో యువకుడు. రైతులలో రైతు. సోషలిస్టులలో సోషలిస్టు. కాంగ్రెసు భక్తులలో కాంగ్రెసు భక్తుడు. ఏ ఉద్యమము నెడలను వీరికి స్పర్థ లేదు. అన్నిటిని సమన్వయము చేసుకొనగల ఉదార చరితుడు. జన సామాన్యముయొక్క నిర్మాణ సంఘటనా శక్తియందు సంపూర్ణ విశ్వాసముగల కార్యదక్షుడు. ప్రపంచముతో బాటు పరివర్తనమునందు వలసియున్నను భరతవర్షము తన ధారావాహికమైన సంస్కృతిని రక్షించుకొనుటయందు నిండు భక్తిగల అభిమాని. సోషలిస్టు అయ్యు, గృహ పరిశ్రమలే యెప్పటికైనను ప్రపంచమును బాధించుచున్న నిరుద్యోగ సమస్యను, ఆర్థిక స్పర్ధను తొలగించి, జనపదముల భాగ్య, భోగ్యములను పోషించగలుగునని నమ్మిన కుటీరవిశ్వాసి. మంత్రిత్వ స్వీకరణమున కనుకూలుడైనను కాంగ్రెసుయొక్క విధికృత్యములు, శాసనసభల బయటనే యెక్కువగా నిర్వర్తింపబడవలయునని, వాదించు గ్రామోజ్జీవ ప్రబోధకుడు కర్షకులకు, కార్మికులకు, ప్రత్యేక సంఘముల ఆవశ్యకత నిరూపించియు, కాంగ్రెసుయొక్క సమగ్రతను పోషించ సమకట్టు కాంగ్రెసువాది. సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యమును సంకుచిత పరచుటకు యేమాత్రమును అంగీకరించకపోయినను, తత్సిద్ధికి పూర్వకము, దేశము క్రమానుగతముగ దాటవలసిన కక్ష్యాంతరములను గుర్తింపగల వివేకి. ఖద్దరు, దేశకల్యాణము నవే

క్షించు ప్రతి భారతీయుడు విధిగ ధరింపవలసిన దీక్షా వస్త్ర మని వారి దృఢవిశ్వాసము. నేడు, సాంఘిక రాజకీయ విష యములలో ప్రబలుచున్న సమాన ప్రతిపత్తి, ఆర్థిక శాఖను గూడ అనువర్తించిన కొలదియు సామ్యనీతి విరుద్ధమైన జమీందారీపద్ధతి వెంటనే కాకపోయినను యెప్పటికైనను అంతరించక తప్పదని వారి సిద్ధాంతము. బ్రహ్మయ్యగారు తీవ్ర సామ్యవాదులు కోరునట్లు ప్రైవేటు ఆస్తి అనునది పూర్తిగా పోవుటను అంగీకరించకపోయినను, ధనముదొక్క పెట్టుబడులచే, కర్మకారుల యొక్కయు, పాటకప్రజానీకము యొక్కయు, కాయకష్టమును ద్రవ్యోపార్జన సాధకముగా జేసుకొను 'కేపిటలిజం' పద్ధతిని పూర్తిగా నిరసించెదరు. సాధ్యమైనంత వరకు దేశములోని ప్రధాన పరిశ్రమలను షాహుకార్ల వశమునుండి తప్పించి వానిని నేషనలైజు చేయుట అవసరమనికూడా సూచించెదరు. రష్యాలోని శాసన వ్యవస్థలో యిటీవల జరిగిన మార్పులనుబట్టి, వ్యష్టి జీవనమును, సమిష్టికి కేవలము దాస్య మొనర్చునట్లు చేయుట మానవ ప్రకృతి సహింపజాలదని, స్పష్టమగుచున్నది. వ్యష్టి సమిష్టిలు రెండును, సమాన స్వాతంత్ర్యములు గలవి. వ్యష్టి స్వాతంత్ర్యము పేరట సమష్టియొక్క అధికారమును, సంపూర్తిగా నిరాకరించునా, సంఘము అరాచకమునకు దిగి విచ్ఛిన్నమగును, సమష్టి తన యధికారముచే వ్యష్టిని పూర్తిగా అణగద్రొక్కునా, స్వాతంత్ర్యము నామమాత్రమై మానవ ప్రకృతి విలసన రహితమైన, యంత్రము పగిది జడతుల్య మగును. మానవుని భావిదశ, ఈ వ్యష్టి స్వాతంత్ర్యమును, ఈ సమష్టి

అధికారమును సమన్వయపరచుటయందే కలదని బ్రహ్మయ్యగారి సిద్ధాంతము. బ్రహ్మయ్యగారి వివేచనా పటిమ అత్యద్భుతము. ఏవిషయమునైనను సమగ్ర దృష్టితో పరిశీలింపగలరు. సంస్కారోత్సాహు లయ్యు ప్రతి పాత వ్యవస్థను నిరసింపరు. ప్రాచీన సంస్థల యెడ గౌరవముండియు, క్రొత్త భావములను స్వీకరించుటకు సాహసమును జూపెదరు. జాతీయ జీవనములోని సాంఘిక, ఆర్థిక, నైతిక ప్రచురణము లన్నింటికిని యేకవాక్యతను గూర్పగల విశాలప్రతిభ గలదు. యువకులైనందుకు వుత్సాహపూరితులైనను, పెద్దలను తూలనాడరు. పెద్దలను గౌరవించుచు, యువకులతో కలసి పని చేయగలరు. రైతులయ్యు, కాంగ్రెసు ఒక్క రైతుదే గాని, యితరుల కందు తావుండరాదని వాదించరు. కర్మకారుల సంఘీభావమును, ప్రోద్బలపరచుచున్నను, యెర్రజెండాను కాంగ్రెసు ధ్వజముపై నెక్కించునంతటి అసహనశీలురు కారు. పెద్దల నెమ్మదియు; యువకుల భావావేగమును, వీరియందు సామంజస్యము నొందినటుల ముంశాకరియందు గాంచజాలము"

19-6-37 సం॥ కృష్ణాపత్రిక.

# స్వభావము

ఆయనకు పెద్దలయెడల భక్తి, గౌరవాభిమానములు మెండు. సహచరులను ప్రేమిస్తాడు. చిన్నలను బుజ్జగిస్తాడు. వర్కర్లయందభిమానము కల్గి వారి కష్టసుఖాలలో పాల్గొంటాడు. అన్నిరకాల మనుష్యులను ఆకర్షించగలడు. అందరిని ఆప్యాయంగా పలుకరిస్తాడు. ఆయనలో మరో విశేషమేమంటే అన్నిరకాల మనుష్యులతోను అరమర లేక అతికి పోగలడు. తాను పెద్ద, పరాయివాలు చిన్న అనే భావం ఆయనకే కోశాన లేదు. వ్యక్తిగతంగాను, రాజకీయంగాను కూడా ఆయనది పవిత్రశీలం.

ఆయన క్షణం వృధాపుచ్చడు. యేదో ఒకపని వుండాలి. ఆ పని చేయుటంలో కూడా ఆలస్యం లేకుండా అతి త్వరగా ముగించడానికి ప్రయత్నిస్తాడు. పని అయ్యేవరకు నిద్రపోడు. తాను చేయుటే గాదు, యితరుల ప్రోత్సహించి చేయించ గల శక్తివంతుడు.

ఆయన స్వభావంలో ప్రధానమైనది (One thing at a time) యేకాగ్రతతో పనిచేయుట వుత్తరంపైన చిరునామా వ్రాస్తూ కూడా సంభాషణ జేయడు. కాలనిర్ణయ పద్ధతిని (Punctuality) అధికంగా పాటిస్తాడు. ఒక ఆదర్శంతో పని చేస్తాడు కాని Cheap popularity కొరకు యేపని చేయడు. (Deserve and desire) అర్హతను మించి ఆశించరాదని ఆయన ఆశయం. *

---

* దేశోద్ధారక నాగేశ్వరరావుగారు ఢిల్లీ శాసనసభకు రాజీనామా యిచ్చినప్పుడు దానికభ్యర్థిగా నిలువవలసిందని పట్టాభిగారు కోరగా,

పదవులు అక్కరలేదనే శాంతమనుడూ గాదు. పదవీ వ్యామోహపరుడునూ గాదు. పదవిని, సేవాశ్రితంగా భావిస్తాడు. అందుచేత ఒక్కదానిలోనే అట్టిపెట్టుకొని వుండ కోరతాడు * ప్రథమకోపం కద్దు గాని దీర్ఘకోపి గాదు. పరాభిప్రాయములను గౌరవించగలడు. తన మాటే నెగ్గాలనే పట్టుదలకలవాడు గాదు. అందుచేతనే ఆయనకు ప్రతికూల పక్షములలో గూడ మిత్రులు కలరు.

ముగమిచ్చకములు, మెరమెచ్చులు లేవు. ఆ నిష్కర్ష వల్లనే కొంతమంది కాయన అయిష్టుడయినాడు. తనమిత్రులైనవారు, తనను శంకించడం ఆయన సహించలేడు. మిత్రిత్వమునో, శత్రుత్వమునో కోరుమగాని, డోలాయమానంగాను, లౌకికంగాను వుండే మధ్యరకపు పద్ధతిని ఆయన నిరసించును. స్నేహపాత్రుడు మిత్రులకై యెంత త్యాగమైనను చేయగలడు. ఆయనకు మిత్రప్రేమతో బాటు బంధుప్రేమకూడా అధికమే.

సాంఘికముగా విప్లవాదిగాను, పూర్వాచారపరాయణుడునుగాదు. మధ్యమార్గమాయనిది. అన్నిట్లోను అంతే!

---

ఆ సభలో నేను చేయి నెత్తుటమినహా చేయగలిగింది లేదు. మద్రాసు సభలో అయితే నేను రైతు సమస్యలపైనా నియోజకవర్గానికైనా వుపయోగం చేయకలుగుతాను అని అన్నాడు. యే సమావేశంలోనైనాసరే యేసభలోనైనాసరే మొదటివాడుగానే వుండగోరుతాడు కాని అప్రధానంగా వుండడం గాని అనవసర విషయాలలో ఆధిక్యతను కోరడంగాని ఆయన స్వభావానికి వ్యతిరేకం.

* 1937 సం॥లో యీయన రాష్ట్ర రైతుసంఘాని కధ్యక్షుడుగానుండగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శియైనప్పుడు రైతుసంఘాధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చెను. పెక్కురంగాలలో ప్రవేశించుటకు యిష్టపడక, తన క్రియాశక్తులన్నిటిని యేకోన్ముఖముగా నుంచి ప్రయత్నించును.

ఒక విషయం తన ప్రతికూలపక్షంలోనివ్యక్తి సంబిదిసూచించినా, ఆమోదిస్తాడు. అలాగే తన ప్రతికూలుర విషయంలో కూడా ఆయన విషయాన్నిబట్టి మాట్లాడుతాడుగాని వ్యక్తిని బట్టి మాట్లాడడు.

శీఘ్రనిర్ణయం చేస్తాడు, ఒక నిర్ణయానికివస్తే మారడు.

దానధర్మాలు యథాశక్తిగా చేస్తూంటాడు. హారిజనుల విషయంలోను విద్యార్థుల విషయంలోను అధికం. చేతనైన సహాయము ప్రతివారికి చేయాలనే ఆయన తత్పరత. తనకు సాయంచేసినవారిని యెన్నడూ మరచిపోడు తనవల్ల సహాయం పొందినవారి మేలుకూడా యెల్లప్పుడు కోరుతూవుంటాడు.

ఆయన అధికంగా పొదుపరి. ఆర్థికంగా యెప్పటికప్పుడు తన సంగతి తాను చూచుకొనుటేగాక, తన మిత్రులవిషయం కూడా గమనిస్తూ, హెచ్చరిస్తూవుంటాడు.

మానవులకుండవలసిన గుణములలో ఆత్మగౌరవము ముఖ్యమైనది. తనయందు తనకు గౌరవముండుటేగాక, ప్రతి మానవునియందు గౌరవముండుటే ఆత్మగౌరవమనబడును. ఆత్మగౌరవము వలన మనుజుడు తాను గొప్పవాడగుటయేగాక, యితరుల గొప్పతనాన్నికూడా గుర్తెరిగి గౌరవిస్తాడు. యీ గుణం ఆయనలో అధికంగా వున్నది. ♦

♦ సాధారణంగా వుపాధ్యాయులుగాని, యితర చిన్న వుద్యోగస్తులుగాని అధ్యక్షుల యెదుట, పై అధికార్ల యెదుట నిలబడి తమ కష్టసుఖాలను నివేదించడం ఆచారం. ఈయన తాలూకాబోర్డు అధ్యక్షుడుగా నున్నప్పుడు వుపాధ్యాయులు నిలబడే మాట్లాడ నారంభించిరి. కాని బ్రహ్మయ్యగారు వారు కుర్చీలో కూర్చుండినగాని యేవిషయం తమతో మాట్లాడ వీలులేదని వారిని కుర్చీలో కూర్చుండి మాట్లాడేటట్లు యేర్పాటు చేశాడు. ఉపాధ్యా

మహర్షి వందేమాతర మంత్రాన్ని జపిస్తూ, ఆ దేవిని ఆరాధించమని స్వీయ సాదృశంచేతనే ప్రబోధించుట ఆయన జీవిత లక్ష్యం.

“భావమున భేదములు
బహునానేకత్వములు
అంధాను కరణములు
మొదలంట తుడిచివైచి
సోదరా!
కదలరా కార్యరంగమునకు”

—ఏడిద కామేశ్వరరావు

---

# ఉపసంహారం

“లోపమదేమి తెల్గు లతిలోక మనీషలు దారతాసము
ద్దీపితులంచితార్థ సముదీర్ణులహో! భువనత్రయంబు నో
క్కూపున లేపువారు మహిమోజ్జ్వలు లేయటులయ్యు నామమున్
రూపము లేకయుంటకు నెఱుంగుడసూయలు కారణంబుగన్”

—తుమ్మల.

ఆంధ్రజాతి ప్రాచీనమైనదే కాదు. అధిక ప్రాముఖ్యమైనదికూడా. నేడును మనం ఎవరికీ ఎందునా తీసిపోము. కాని ఈ జాతికి ప్రపంచంలో మాట అటుంచి భారత దేశంలోనే ఖ్యాతి లేదు. దీనికి కారణమేమి? ఉత్తరాదివారి యీసడింపు కాదు. అరవ పితలాటము కాదు.

మనలో అనేక మంచి గుణాలున్నవి. కాని ఆదినుండి నేటివరకున్న పెద్దరోగ మొక్కటే. ఓర్వలేనితనము, కక్షలు, స్వజాతి వైరము. మన జాతీయ చరిత్ర కక్షల కాపురం. అందు చేతనే కష్టభూయిష్టమైనది. మనపల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధం ఏమి చెప్పుచున్నవి? ఆయుద్ధాలేగాదు, నేటి మన గ్రామ కక్షలు, కలహాలు, యుద్ధాలుకూడ ఇందుకు నిదర్శనం.

మనం కాంగ్రెసులో ఘనతర త్యాగాలు చేశాం, కాని ప్రయోజనమేమి? కాంగ్రెసు గద్దెనెక్కిన ఘనత మనకు నేడు గదలంభించింది. ఆంధ్రులలో భారత ప్రభుత్వములో ఒక మంత్రి లేడు.

ప్రకాశం ప్రధానిగా వుండుట ఆంధ్ర ప్రముఖుడు ఓర్వలేడు.

ఆచార్య రంగా కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గ సభ్యుడగుట మన పెద్దలు ప్రశంసించలేరు.

బ్రహ్మయ్య శాసనసభ్యుడగుట కృష్ణాజిల్లాలోని కాంగ్రెసు గోముఖ వ్యాఘ్రాలు సహించలేవు.

ఎట్లా మనం అభివృద్ధిచెందేది ?

ఈ సంగతినిగురించి మన పట్టాభిగారి పలుకులు పరికించతగినవి.

* "కొన్ని కొన్ని విషయాలనుగురించి మనం ఆత్మ పరిశీలన చేసుకోవాలి. మనలో త్యాగధనులున్నారు. నిష్కళంక దేశభక్తు లున్నారు. స్వార్థత్యాగులున్నారు. ఉత్తర హిందూస్థానంతో పోల్చిచూచినప్పుడు మనలో ఒక విశేషం

---

* 1949-1-13 మద్రాసు ఉపన్యాసంనుండి

కనిపిస్తుంది. మనకు రెండవనాయకత్వం (Second rate) హెచ్చుగావుంది. ఉత్తర హిందూస్థానంలో పరిస్థితి దీనికి భిన్నము. మనవారంతా అతిరథులేగాని ఉపరథులు కారు. మహారథులకంటె కొద్ది తేడాలో వుంటారు. అది మనవిశిష్టత.

అయితే మనలో కొన్ని లోపాలున్నవి. అందులో ఒకటి మహాపాపిష్టిది ఈర్ష్య. మరొకటి మహాప్రమాదమైనది గర్వం. మనలో ఒకడు పైకిరావడం, అగ్రశ్రేణిచెందడం మనతోటివారికే ఇష్టంవుండకపోవడము. పాతిక అర్జీలు, వంద ఆకాశ రామన్న ఉత్తరాలు తయారు అవుతవి. ఇది చాలా శోచనీయస్థితి. ఇలాంటివానివలన మనకు మంచి జరగదు సరికదా కీడు హెచ్చుతుంది.

మనమంతా ఒక కుటుంబంవారం అనే సమష్టిభావం పెంపొందించుకోవాలి. ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో సమస్యలన్నీ పరిష్కరించుకొని దేశక్షేమం దృష్టిలోనుంచుకొని ముందుకు సాగిపోవాలి."

జాతి ఉన్నతి అవనతి జాతీయ ఐక్యతమీద ఆధారపడి వుండును. మనలో జాతీయైక్యత లేదు. ఐక్యతమాట అటుంచి జాతీయజీవనము లేదు. ఇందువల్ల మనం హీనస్థితిలో వున్నాము.

మనలో మార్పురాదా? రాలేదా? పట్టాభిగారికి పట్టాభిషేకం జరిగినందుకు ఆంధ్రులందరు ఆనందించతగింది. ఈ ఎన్నికలో మనం సంతోషించతగిన విశేషముకూడ మరొకటి వున్నది. ఆంధ్రావనిలో అందరి మన్ననలు అందుకున్న నాయకత్రయం ఏకోన్ముఖంగా పనిచేయుట. పట్టాభి

ప్రకాశం రంగాగార్ల నాయకత్వాన ఆంధ్రజాతి కెంతో శుభ ప్రదం, ఆత్మగౌరవప్రదం. సిరి అన్యోన్యత అభివృద్ధిపొంది భారతదేశంలో ఆంధ్రులు ఘనగౌరవానికి నోచ్చుదుగాక !

ఆంధ్రులు ఈర్ష్యాజాడ్యం నుంచి విముక్తులుగానిదే వ్యక్తిగతంగాగాని, సమష్టిగాగాని అభివృద్ధిపొందలేరు. ఈ సంగతి ఎంతత్వరగా గ్రహిస్తే అంతత్వరగా అభి వృద్ధి పొందగలరు.

" పలుకకయుండుటకంటె దగ బల్కుట మేలు వినుండు సత్యముం
బలుకుట ధర్మమార్గమున బల్కుట సర్వజనప్రియంబుగా
బలుకుట యోలి నిక్కడభంగులు వనిరెరింగి యుండులై
బలుకక నాల్గు చందముల బల్కగ మెత్తురు వాని దేవతల్॥

—భారతము.

# అనుబంధము

## ఆహారసభలో అమూల్య సలహాలు.

మన దేశంలో తిండికరువు ఏర్పడింది. ఆ కరువు నివారణకుగాను ఆహార సంఘాలు దేశమంతటా ఏర్పడినవి. బ్రహ్మయ్యగారు రాష్ట్రీయ ఆహార సలహాసంఘసభులలో సభ్యులు.

స్వానుభవముగా వ్యవసాయముచేయు రైతైన మన రైతుపెద్ద అనుభవపూర్వకపు సలహాలు గణింపతగినవి.

ఆయనచేసిన సూచనలు అమల్లోకి తెచ్చుటకు మనమంతా కృషిచేసి అఖిల ప్రపంచానికి, రైతులోకానికి తోడ్పడాలి.

### ప్రథమ సభలో ఆయన సూచనలు 1-2-48.

"మనది పూర్తిగవ్యవసాయదేశం. ఫలవంతమైన భూములు పంటల కనుగుణ్యమైన వర్షములు, జలాధారములు ప్రకృతిసిద్ధముగనే గలవు. అయినను నానాటికి ఆహారకొరత హెచ్చుచున్నది. దీనికి కారణం ప్రభుత్వము వ్యవసాయమునెడ చూపు నిర్లక్ష్యభావమే. వెనుకటి విదేశీయ ప్రభుత్వ పద్ధతులను పూర్తిగ రద్దుచేసి వ్యవసాయ అభ్యున్నతికై విప్లవాత్మక (Kevolutionery) కార్యక్రమము నేర్పరచి యుద్ధకాలమున సేనల తరలింపుకై చేసినంత చురుకుగ యీ కార్యక్రమము నమలుపరచవలెను.

ఇందులకు నూతన ప్రాజెక్టుల నిర్మాణమునుగూర్చి ప్రభుత్వము తీసుకొనుచున్న శ్రద్ధ ప్రశంశనీయము. ఆ నిర్మాణము యింతలో పూర్తి అగునదికాదు. మనది తరుచు రావ్టీముగా లెఖలవల్ల తేలుచున్నది. స్వయం సంపూర్ణతకై కృషిచేయవలసిన బాధ్యత మనపైగలదు. కూటికి, గుడ్డకు పరులపై ఆధారపడు దేశము స్వతంత్రముగ మనజాలదు.

ప్రభుత్వ సంజాయిషీనిబట్టి గత సంవత్సరం కంటె నాల్గవవంతు పంట నష్టమైనట్లు కన్పడుచున్నది. యీ లెఖలు సరియైనవికావని చెప్పవలసి వచ్చినందుకు చింతించుచున్నాను. ప్రభుత్వ తాబేదార్లు భూములపైకి వెళ్ళి వేసిన అంచనాలుకావు యివి, అట్లుగా వేయుచున్న అంచనాలున్ను సరిగా వుండవు అని రైతుగా నాకుగల అనుభవం వల్ల మనవిచేయుచున్నాను. యేదిరొట్లున్నను హెచ్చు వుత్పత్తికై పాడుపడుట మన ప్రథమకర్తవ్యం.

పంటలకు నా సూచనలు :

1. సాగుకాలములో నూతన మొక్క ఆగస్టు 15 వ తేదీలోగా యెన్ని యకరాలు హెచ్చుచేస్తే అంత పంట హెచ్చుగాగలదు. 'చేతిలో కర్రనంటే చేలో కర్రి' నుగుణంగా హెచ్చుపంట నివ్వగలరు, అను వ్యవసాయ సామెత కలదు. అందువల్ల పల్లెకాపురస్థులైనవారు హెచ్చు శ్రద్ధవహించాలి. యీ వుద్యోగుల గారి ప్రశస్తిలను వారి పాలనలో గల భూమి మునుగు పూర్తినిబట్టి పరిగణించాలి.

2. నెం 12 వ, పొట్టి బక్కబియ్యం, సెంబమసన్నం, బసంగి, కృష్ణ కాటుకలు వగైరా హెచ్చుపంట నివ్వగలవని ప్రభుత్వనిపుణులు చెప్పు చున్నారు. నాల్గవవంతు పంట హెచ్చు కాగలదని అనుభవం వల్ల మాకు తెలియును. అయితే యెరువులు హెచ్చుగా అవసరం గాన యెరువులున్నా శ్రేష్టమైన విత్తనాలు సప్లయిచేయుటకు, ప్రచారం, వ్యవసాయశాఖవారు చేయవలసి యున్నది. దురదృష్టవశాత్తు యీ డిపార్టుమెంటునుండి రయితులకు సహాయము జరుగగలదని ఆశించినదానిలో శతాంశమైనను జరుగుట లేదని చెప్పక తప్పదు.

ధాన్యసేకరణ సందర్భమున రివిన్యూ వగైరా ప్రభుత్వ వుద్యోగులు పడు తాపత్రయం చూస్తే యిందులో పదవవంతు శ్రమ సాగు రోజుల్లో జరిగితే బాగుండును. ఆవుకు ఆబోతును కలిపే రోజులలో శ్రద్ధవహించక ఆవు యీని చిన్నదూడను పెట్టినపుడు యేడ్చే రయితు స్థితి యీ వుద్యోగుల స్థితి జ్ఞప్తికి తెచ్చుచున్నది

గాన ధాన్య వుత్పత్తి హెచ్చుకై రివిన్యూ నీటి సరఫరా, వ్యవసాయశాఖలు సమిష్టి ప్రయత్నం లాభదాయకం. అందులకు ప్రత్యేక శ్రద్ధ వహించాలి, నేటి కాగితపు ఫర్మానాలు పనిచేయజాలవని మనవిచేయుచున్నాను. నేను మిగులు (Surplus) జిల్లాకు చెందినవాడను, తరుగు (Deficit) జిల్లావారి కష్టములను తెలియనివాడను కాను. చెన్నరాష్ట్రమంతయు యేక కుటుంబముగా సమిష్టి బాధ్యతలో వ్యవహరించవలసివుండును బాధ్యత నాకు తెలియనిది కాదు. అధిక వర్షాలవల్ల అధిక నష్టమువచ్చు మా జిల్లాగుంటూరు అయినా, గత సంవత్సరంకంటె హెచ్చు ధాన్యసేకరణ చేయగలమని నేను హామీనిచ్చుచున్నాను. అయితే ప్రభుత్వంవారు

ప్రచురించినట్లు ధాన్యసేకరణ అంతయు రెండు నెలలలోనే పూర్తికావలెననియు, బియ్యంగాకాక ధాన్యంగానే యెగుమతిచేయబడవలెననియు అనునది కాగల పనికాదు. (not practical) కాగితములపై కలదుగనుటుందేమో.

ధాన్యం యెగుమతి చేయుటకు హెచ్చు రైల్వే వేగన్లు కావలసి వచ్చును. ఈ జిల్లాలలోని బియ్యపు మరలన్నియు మూతబడి నిర్వ్యాపార స్థితి యేర్పడును. అందు పనిచేయు కార్మికులకు యితర వృత్తులను ప్రభుత్వం చూపగలదా?

అధికవర్షాలవల్ల కొంత వరిగడ్డి కుళ్ళిపోయినది; మిగిలినది సారం లేనిదైనది. రెండవ పైరు పెసర, మినుము పశుగ్రాసం నష్టమైనది. ప్రభుత్వంవారి అసమర్థతవల్ల వ్యాపారుల గిడ్డంగులలో జనుములు నిల్వయున్నప్పటికి సకాలములో ప్రభుత్వంవారు నిర్ణయించిన ఖరీదునకు జనుములు సప్లయి చేయబడుటలేదు; యిట్టి స్థితిలో పశువుల దాణాకై వుపయోగపడు చిట్టు తవుడు కూడ రయితులనుండి తీసుకొనబడుటయగును. దీని పర్యవసానం పశువులు యింకా బక్కచిక్కి వ్యవసాయం చేయుటకు శక్తిలేనివగును; దానివల్ల రాబోవు సంవత్సరం యింకా పంట తగ్గక తప్పదు.

యింకా యెరువులకు వుపయోగించు బూడిద; రాబంకై ఉపయోగించు పూక, మసి, కూడ రైతున కందుబాటు లేకుండపోవును గాన యిట్టి పరిస్థితులలోను ధాన్యం యెగుమతికూడదు. బియ్యమే రెండునెలలబదులు ఆరు నెలలో యెగుమతిచేయుట; చేయదగినది.

గతసంవత్సరం యివ్వబడినట్లు రయితుకు బోనస్ యివ్వమని ప్రకటించారు. బోనస్ యిచ్చు ఆచారం మంచిదికాదని నే నంగీకరించుచున్నాను. కాని ధాన్యం ధర పెంచవలసిన ఆవశ్యకత గుర్తించబడవలెనని విచారించుచున్నాను. బియ్యం యెగుమతి చేయు వర్తకునకు హెచ్చు లాభం వచ్చునట్లు చూచుట ప్రభుత్వం తన విధిగా భావించి వుత్పత్తిదారునికి యెంత మాత్రం వ్యవసాయం గిట్టుబాటుకాని విధానమునే అనుసరించుచున్నది. ఈ మీ విధానము హెచ్చు వుత్పత్తికి రయితును ప్రోత్సహించదు. పైగా యింకా లోటునకే దారితీయగలదు. వ్యవసాయం గిట్టుబాటుకాని కారణాన కొంతమంది వ్యవసాయమును నిర్లక్ష్యపెట్టు వర్తకము వైపునకు మొగ్గుట మనము చూచుచున్నాము.

గాన ధాన్యం ధర కాటా బస్తా 1కి రు 16-0-0 పదహారు రూపాయిలకు తక్కువ కాకుండా నిర్ణయించవలసిన అవశ్యకతను గుర్తించవలసిన దిగా మనవిచేయుచున్నాను.

ఇక కంట్రోల్సును గూర్చి. ఇది కృత్రిమపు విధానము. దీని ఫలితము చీకటి బజార్లు, లంచగొండితనం వుత్పత్తిదార్లుగాని, అనుభవదార్లు గాని యిందువల్ల లాభం పొందుటలేదు. ప్రభుత్వమునకు సిబ్బంది ఖర్చు హెచ్చు, వుద్యోగీయులలో అవినీతి వ్యాపన దీని ఫలితం. మహాత్మాజీ యీ కంట్రోల్సు యిట్టి పరిస్థితిలోను వుండరాదని యిచ్చిన అభిప్రాయమును గమనించి ఆచరించుట యుక్తమని మనవిచేయుచున్నాను.''

అదనపుఖర్చు లేకుండ అధికోత్పత్తికి అనుభవపూర్వకమైన అత్యుత్తమ సలహాలను ఇచ్చుట గమనించారు గదా. ప్రభుత్వంవారు ఎప్పటి పద్ధతినేగాని యీ సలహాలను అమలులో పెట్టక, అధికోత్పత్తి, అధికోత్పత్తి, అని అరచుట తప్ప అధికోత్పత్తికి అవగింజంతైనా తోడ్పడదు. పండించిన రైతును మాత్రము పట్టి వేధించుట మినహా వాని గోడు వినువారు లేరు.

## రెండవ మీటింగులో చేసిన సూచనలు 7-10-48

కంట్రోళ్ళు, లెవనింగు ఫలితం అవినీతి, దొంగవ్యాపారం లంచగొండితనం అనుట నిస్సందేహం మహాత్మాజీ సలహా కంట్రోళ్ళు పూర్తిగ రద్దు చేయాలి అని. ప్రభుత్వ నిర్ణయం అమలు - కొంతవరకు లెవనింగు తీసివేయుటమాత్రమే. రవాణా నిర్బంధాలు, లైసెన్సులద్వారా అమ్మకం, ధరల కంట్రోళ్ళు తొలగించలేదు.

ఇప్పుడు ద్రవ్యోల్బణ (Inflation) తగ్గించుట అను సాకుతో తిరిగి కంట్రోళ్ళ అమలు అను పాలిసీ వినపడుచున్నది. మన రాష్ట్ర ప్రజాభిప్రాయంలో రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగ యేకీభవించి కంట్రోళ్లు తిరిగి పెట్టుట లాభదాయకం కాదని అభిప్రాయపడుట ప్రశంసనీయమే. దుష్ఫలితములను రద్దుచేయుటకు మనము కంట్రోళ్ళు రెత్తివేయుటకు నిర్ణయించితిమో తిరిగి పెట్టుటవల్ల ఆ అవినీతి, దొంగవ్యాపారం, లంచగొండితనములను పరోక్షముగ ప్రోత్సహించుచున్నామను సంగతి గమనించవలసియున్నది.

తనకు ఆహార ధాన్యాదులను సప్లయిచేయుచున్న కారణాన కేంద్ర ప్రభుత్వం కంట్రోళ్ళు పెట్టుటకై రాష్ట్ర ప్రభుత్వమును ప్రత్తిడిచేయుట గర్హించదగిన విషయము. పెట్టుబడిదారు అప్పుతీసుకున్నా పేదవాని స్వేచ్ఛను అరికట్టి తన ఉనికి సుస్థిరపరచు కృత్యము చేయించు సామ్యవాదమే యింకను కల్పించుచున్నది.

ప్రజాస్వామ్య ప్రియులైన మహాత్ముడు ప్రజాభిప్రాయములో యేకీభవించెను. నేడు ప్రభుత్వమును నడుపుచున్న మహానాయకులు పట్టణవాస్తవ్యుల విద్యార్థుల వుద్యోగస్థుల ఆందోళనకు జంకి ప్రజాభిప్రాయమునకు స్వస్తిచెప్పి అల్ప సంఖ్యాకుల లాభమును కలుగజేయు కంట్రోళ్ళను తిరిగి ప్రజలపై రుద్ద నిర్ణయించినారు. యిందులకు సప్లైటూళ్ళ ప్రజలతరపున వ్యవసాయముపై జీవించు నూటికి 86 గురు ప్రజానీకం తరపున మా వ్యతిరేకతను తెలుపుట మావిధి.

పేద ప్రజలకు ప్రభుత్వ తాబేదార్లగు చిన్న వుద్యోగీయులకు చౌక ధాన్యపు డిపోలను పెట్టవచ్చును. యిట్టి కొలదిమందికొరకు వుత్పత్తిదారు కునష్టదాయకములగు ప్రతిబంధముల కల్పించి ధనవంతులగు పట్టణవాస్తవ్యులకు లాభములు కలుగజేయరాదు. దీనినే పేదవానిని మరింత పేదవానిని చేయుట ధనవంతుని మరింత ధనికునిచేయుటయును పాలసీ విధానము. పది సంవత్సరాలనాడు శ్రీ విశ్వేశ్వరయ్యగారు ప్రకటించిన సం॥ కి తల ఆదాయం.

కెనడా — రు 1033

అమెరికా — 1400

ఇంగ్లాండు — 980

ఇండియా — 65 ఆదాయమును పెంచి, కొనుగోలు శక్తిని హెచ్చుచేసిన దేశసౌభాగ్యమునకు అది చిహ్నము, ధాన్యపు ధరలు పెరిగిన కారణాన రైతుస్థితి బాగుపడినట్లు ప్రభుత్వ రిపోర్టులలో కలదు. యిది యదార్థపు పరిస్థితులకు వ్యతిరేకం. ధాన్యపుధరలు రెట్టింపుమాత్రమే పెరుగుటయు రైతుకొనుక్కొనవలసినవి అయిదురెట్లు పదిరెట్లు పెరుగుటయు, వ్యవసాయకూలి మూడు నాల్గురెట్లు పెరుగుటయు గమనించవలసి యున్నది.

సఖ్యంకాదు. యీ అధిక ఆహార వుత్పత్తి కార్యక్రమము విఫలమైనదనుచు దానిపై యింకా వ్యయపరచుట వ్యర్థము.

నీటి సరఫరా, రివిన్యూ, వ్యవసాయ, ఆహార, P. W. D. (Revenue, Agriculture, Food irigation) ఆఫీసుల, శాఖల వ్యవహార సరళినిగూర్చి నే నిదివరకు నుచ్చరించాను. యెట్టి మార్పులు కానరావు. ప్ర ఆఫీసులోను పనులు తొందరగా జరుగుటకు కాగితాల అలస్యం కాకుండా వాటం తటవే వాయువేగాన (movement short cut procedure) జరగాలి.

రివిన్యూబోర్డును రద్దుచేసి వ్యవసాయబోర్డు (Agricultural Board) ను యేర్పరచాలి.

## భారత వ్యవసాయ సంస్కరణ సంఘము ఎదుట యిచ్చిన సాక్ష్యము

అఖిల భారత కాంగ్రెసు భారతదేశములో ప్రధానవృత్తి అగు వ్యవసాయమును గురించి భారతదేశమంతట విచారించి తెలియచేయుటకు జె. సి. కుమారప్పగారి అధ్యక్షతక్రింద ఒక కమిటీని ఏర్పరచెను.

ఆ కమిటీవారు వ్యవసాయములో అనుభవమున్న రైతులను రైతు సంఘములను విచారించి రాష్ట్ర ప్రభుత్వ సూచనలతో, భారత వ్యవసాయము తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభదాయకమగునటుల సంస్కరించి సత్వర దేశ ఆర్థిక అభివృద్ధికి దోహదముసంగ సంకల్పించి ఒక ప్రశ్నావళిని జారీజేసిరి.

1948 డిశెంబరులో ఆ కమిటివారు బెజవాడ వచ్చినపుడు యిచ్చిన నివేదిక.

"ఉత్తర హిందూదేశానికి దక్షిణ హిందూదేశానికి భేదం గలదు. అక్కడ భూమి చాలభాగం జమీందారుల ధనవంతుల వశంలో నున్నది.

ముక్కలైన నూటికి డెబ్బదిమంది స్వంత వ్యవసాయదార్లు పదిహేనుమంది మాత్రమే భూ ఖామందులై యితరులకు కౌలుకిస్తున్నారు.

| | |
|---|---|
| ఎక 2 లోపు వ్యవసాయకులు | 51 |
| 2 — 5 లోపు | 31 |
| 5 — 10 | 7 |
| 10 పైన | 11 |
| | 100 |

ముప్పది యకరములలోపు వ్యవసాయం ఏమంతమాత్రం గిట్టుబాటుగా లేదు. రయితు వట్టి దరిద్రుడు పండేపంట పన్నులకు ఖర్చులకు కూడ సరిపోదు. అందుచే ఋణగ్రస్తుడైయున్నాడు. రయితు ఋణపరిష్కారబిల్లు పెట్టినా ధాన్యపుధరలు పెరిగినా యింకా యీరాష్ట్ర రయితుల ఋణం 146 కోట్లు గలదు. రయితు ఋణం లేనివాడుగా వుండాలి. యిందులకు ప్రయివేటు వడ్డీవ్యాపారం నిషేధించాలి. సహకార పరపతిసంఘాలు వూరూర స్థాపింపబడాలి. దీర్ఘవాయిదాల అప్పుల నివ్వాలి. ప్రస్తుత కోర్టులలోని వ్యవహారం (Litigation) చంపాలి. అందుచే (Tribunal) సంచార న్యాయస్థానాలున్నూ యేర్పాటు చేయబడాలి. యిప్పుడు న్యాయం చాల ప్రియమగుచున్నది; చౌక కావాలి.

3. రయితుల భూములు ముక్కలుగా చెక్కలుగా పలుచోట్ల గలవు. గట్ల క్రింద భూమి పాడు అగుచున్నది; అనేకచోట్ల వ్యవసాయం కష్టం నష్టం. ఆసాముల మధ్య పరటాగా యీ యేకీకరణ విధానం నిర్బంధంగా జరుపాలి.

యిందులకు ట్రిబ్యునల్సు యేర్పరచాలి.

మొదటి ట్రిబ్యునల్
1 పంచాయితీబోర్డు అధ్యక్షుడు
2 రయితు సంఘ అధ్యక్షుడు
3 సహకార పరపతిసంఘ అధ్యక్షుడు

అపీలు ట్రిబ్యునల్
1 జిల్లా రయితు సంఘ అధ్యక్షుడు
2 డిప్యూటీ కలెక్టరు
3 డిస్ట్రిక్టు మునసిఫ్

4 రయితులకు తగినంత భూమి సాగుకు లేనికారణాన; ఖర్చులు హెచ్చు, రాబడి తక్కువ అగుచున్నది. అందుచేత తీవ్రతర సంస్కరణలు అవసరం.

Economical Holdings నిర్ణయించాలి. అందులకు కనీసభూమి పల్లం యి 15 పదిహేను యకరాలు

మెట్ట 30 ముప్పది యకరాలు.

యీ పరిమితభూమి ఒకే ఖండంగావుండునట్లు చూడాలి. భాగాస్వాతకలవారు సహితం యీ భూమిని పంపిణీ చేసుకోనరాదు. దీనిమీద వచ్చు ఆదాయం పంచుకోవాలి. * హెచ్చుమంది భాగస్వాములు వున్నయెడల వ్యవసాయమునకు కావలసినవారు మాత్రమే వ్యవసాయం చేస్తూ మిగతావారు యితర చేతిపనులు వృత్తులను అవలంబించాలి.

5. సహకార వ్యవసాయం:— ప్రస్తుతం మూడవవంతు భూమిమాత్రం సాగుచేయబడుచున్నది. యింకా సాగుకు లాయఖుఅయ్యిన భూమి కనీసం మూడవంతు అయినా కలదు. యీ భూమిని స్వంతభూమి లేక వ్యవసాయమే వృత్తిగాగల వ్యవసాయ కూలీలకు వుచితముగా యిచ్చి సహకార పద్ధతిని వ్యవసాయం సాగించాలి. నవీన పనిముట్లు సప్లయి సాంకేతిక నిపుణుల సహాయం, వడ్డీలేని అప్పులు సమకూర్చబడాలి. చిన్న చిన్న యంత్రములను సహితం వ్యవసాయాభివృద్ధికొరకు వినియోగించాలి. యీ యంత్రాల మరమ్మతు చేయగల పనితనమును గ్రామములలో వుండే వడ్రంగులకు; కమ్మర్లకు అలవరచాలి. వారి శక్తిసామర్థ్యములను (Skill) ను పెంచాలి. విద్యుచ్ఛక్తి సరఫరా వ్యవసాయాభివృద్ధికి వినియోగించాలి, శ్రేష్ఠమైన విత్తనాలు సప్లయిచేయుట; పండినపంటకు సరియైన ఖరీదులను రాబట్టుటకు వర్తక సౌకర్యములను చేయుట ధాన్యం వగైరా నిల్వలకు వసతులను కలుగజేయుట వగైరా కార్యక్రమంవల్ల సహకార వ్యవసాయం లాభసాటియని Practical గా రుజువుచేసి ప్రస్తుతమున్న వ్యవసాయకుల నెల్ల సహకార వ్యవసాయ పద్ధతికి తీసుకొనివచ్చుట యిది విధ్యుక్తముగ మెలగవలెను. నిర్బంధం వుండరాదు. యిందులకు హెచ్చు ప్రబోధం అవసరం.

---

* ఇట్టిది ఈజిప్టులో కలదు.

9. ధాన్యపు ధరలు :— ధాన్యం పండితేనే కాదు ధరకూడ పండితేనే రైతు బాగు. Central Marketing Board ను యేర్పరచి రయితు పండించే పంటకు న్యాయమైన దరవచ్చునట్లు చూడాలి. పండించే రైతును కొనుక్కునేవానిని Consumer నష్టపరచి మధ్య దళారీలు హెచ్చులాభమును అక్రమముగా పొందుచున్నారు. యీ మధ్య దళారీలు అంతమొందవలెను. ప్రభుత్వ నియమిత సహకార సంస్థలు; ప్రభుత్వ బ్యాంకులనుండి తృప్తికరముగ పెట్టుబడులను తీసుకొని యీ ధాన్యపు వ్యాపారములను సాగించుట జరుగవలెను. ధాన్యపు నిల్వలకు తగిన కట్టడములను ప్రభుత్వం గ్రాంటులనిచ్చి నిర్మించవలెను. ధాన్యపు ధరలను పెంచి రైతు కొనుగోలుశక్తిని పెంచిన పరిశ్రమలకు లాభమేకాని నష్టంకాదు.

10. పన్నులు :— యితర దేశములతో పోల్చి చూచిన పంట తక్కువ పన్నులు హెచ్చు మనస్థితి. యీ స్థితి తారుమారు కావలెను. కుటుంబ పోషణకు తగిన పంటను పండించుకొను రైతుపై పన్ను భారముండరాదు అను ప్రాతిపదికపై వ్యవహరించుట న్యాయము. రాబడిపన్ను వగైరా అన్ని పన్నులను ఆ అంతస్థుపైననే వేయబడుచున్నవి. వ్యవసాయమునకు ప్రత్యేకరక్షణ నీయుటకు మారు ప్రత్యేకం మోయలేని భారమువుంచబడుచున్నది. యిప్పటిస్థితి పూర్తిగ మారవలెను.

యిందులకు నా సూచన క్రమానుగత పన్నుల అభివృద్ధి విధానము.

య 16 లకు య 1 కి 1-0-0 పన్ను మాత్రమే
య 15 — 50 2-0-0
50 — 100 3-0-0
100 పైవారికి 4-0-0 లో లేక యింక హెచ్చుపన్ను

భూమిపై ఒకే పన్ను వుండాలి. వ్యవసాయ ఆదాయంపై పన్ను వేయబడే రోజుల యీ భూమిపన్ను రద్దుపరచబడవలెను.

11. ఉపపరిశ్రమలు :— వ్యవసాయంపై ఆధారపడి జీవయాత్ర గడుపువారు నూటికి 86 మంది గలరు. యింతమందిని వ్యవసాయం పోషించలేకున్నది. దీనితోడు ఉపపరిశ్రమలను ప్రోత్సహించవలసియున్నది.

ఆ వి:— కాటన్ను, వస్త్రం, కమ్మరం, కుమ్మరి, తేనెఉత్పత్తి పాడి, కోళ్లు, తాటిబెల్లం, చర్మకార, వివిధ ఉత్పత్తులు, మాల్టు, కాగిత పరిశ్రమ వగైరా—

కాటన్ను విషయమై యింకా అభివృద్ధి జరగాలి యితర దేశాలనుండి దిగుమతి అయ్యే సరుకులను యిక్కడనే కుటీరపరిశ్రమలుగా పెంపొందించాలి. యీ సందర్భంలో జపానును అనుకరించాలి.

పెద్ద పరిశ్రమలలో చిన్న చిన్న భాగాలను పల్లెటూళ్ళకు మార్చాలి. దీనివల్ల రెండు విధాలు లాభాలు.

1. బస్తీలలో హెచ్చు కేంద్రీకరణ అయిన కార్మికుల సమ్మెలు వగైరాలు తగ్గగలవు.
2. పల్లెటూళ్ళలోని నిర్వ్యాపారత తగ్గగలదు. నిపుణత పెరుగుతుంది.

వ్యవసాయానికి, ఉపపరిశ్రమలకు సహితం Power విద్యుచ్ఛక్తిని వుపయోగించుటవల్ల తక్కువ శ్రమలో హెచ్చు వుత్పత్తి అగుటకు తోడ్పడ వలెను.

12. వాణిజ్యపు పంటలు:— Commercial Crops

ఆహారకొరతను దృష్టిలో వుంచుకుని వాణిజ్యపు పంటలు (Commercial Crops) ను పండించరాదని అంతు చేయుట దూరదృష్టిలేనిపని. నూటికి 84 యకరాలలో ఆహారపదార్థములే వుత్పత్తిచేయుబడుచున్నవి — నూటికి ఒకటి రెండు యకరాలకు తక్కువగనే యీ — వాణిజ్యపు పంటలు (Commercial Grops) చేయబడుచున్నవి. యీ పైరు పండింపబడు భూములు ఆహారపదార్థముల పంటకు అయోగ్యములను సంగతి ప్రథమతః తెలుసుకొనతగినది. భూసారమును బట్టి, శీతోష్ణస్థితులనుబట్టి నువ్వు, మిరప, ధనియం, వేరుశనగ; జొన్న, పసుపు, కూరగాయలు, పండ్ల తోటలు వగైరాలను ప్రోత్సహించుట అవసరమున్ను న్యాయమున్ను అయియున్నది. అమెరికా, జపాను దేశములందు మనకంటె హెచ్చుగా యీ వాణిజ్యపు పంటలు Commercial Grops సాగుచేయుబడుచున్న సంగతి గమనించవలసియున్నది.

**13.** విద్య :— విద్యా వ్యవసాయాభివృద్ధికి హెచ్చుగా వుపయోగపడాలి. సాంకేతికవిద్య: వృక్ష, పశు, కీటక వృక్షశాస్త్రముల బోధనకు ప్రాముఖ్యమివ్వాలి.

**14.** ధాన్య సంరక్షణకు :— వేడిచేయు యంత్రాలు, పబ్లిక గోదాములు (Dying machines Public ware Houses) కావాలి. సరియైన గోదాములు (Godowns) లేక 30 లక్షల టన్నుల ధాన్యం నష్టమైనదని ప్రభుత్వపు అంచనా యిందులకు దీర్ఘ వాయిదా అప్పుల నిచ్చి కొలది గ్రాంటుల నిచ్చి రైతుల ప్రోత్సహించవలెను. ధాన్యం అమ్మకానికి మార్కెట్లు (open markets) అవసరం. మిల్లుదారులనుండి రైతుసంరక్షణ అవసరం. ప్రభుత్వమే సహకార సంఘాలద్వారా వ్యాపారం సాగించాలి.

**15.** ధాన్యం, పశువుల భీమాసంస్థల నిర్మాణం అవసరం.

**16.** కౌలుదార్లు :— యితరవృత్తులలో వుండి భూములను సంపాదించి వాటిని కౌళ్ళకు యిచ్చి హెచ్చులాభమును గుంజువారు గలరు. కౌలుదార్లకు నూటికి 16 కంటె హెచ్చు గిట్టుబాటు యెట్టి పరిస్థితిలోను వుండదు. యీ లేకు రెండు సంవత్సరముల నోటీసు నిచ్చి స్వంత వ్యవసాయం చేసుకొనవలసినదిగా నిర్ణయించవలెను. అట్లుగా చేసుకొననియెడల ఆ భూములకు ఒక నిర్ణీతమైన ఖరీదు యిరువది వాయిదాలలో యిచ్చునట్లు కౌలుదారుకు సంక్రమింపచేయవలెను.

కౌలు నిర్ణయము చేయవలెను. పంటలో సగంకంటె హెచ్చుకౌలు నిర్ణయించరాదు.

**17.** వ్యవసాయకూలీలు :— యిదొక ప్రత్యేక సమస్య. వీరి స్థితి రైతుస్థితికంటె అధ్వాన్నముగ నున్నది. తిన తిండి, కట్ట గుడ్డ, నివసించుటకు గృహమైనను లేక బహు దీనస్థితియందున్నారు. యిందులో హెచ్చుమంది హరిజనులే.

వీరి కుండుచున్న అప్పులన్నియు రద్దుపరచాలి. వీరికి పెట్టుబడి పెట్టినది రైతులే, వారి వ్యవసాయంలోనే వీరూవున్నారు. గాన యెట్టి షరతులు లేకుండా ఆ అప్పులన్నియూ రద్దుచేయబడవలెను.

వీరి ప్రత్యేక గూడెముల నివాసములను రద్దుచేసి గ్రామాల వంటి వున్న భూములను ప్రభుత్వంవారు స్వాధీనపరచుకుని ఒక్కొక్క కుటుంబమునకు అరు సెంట్లు లేక మూడువందల గజాలు స్థలమును ప్రత్యేకించి అందులో పక్కా భవనములను నిర్మించి సగం మొత్తం ప్రభుత్వం భరించి మిగతా సగం పదిహేను వాయిదాలపై ఆ వ్యవసాయకూలి రోజరి పనిలో వుండుగనే ఆ రయితువద్ద వసూలుచేయవలెను. (భీమాకం పెనీ వాయిదాల వలె) బంజరు భూములన్నియు యీ వ్యవసాయ కూలీలకిచ్చి వీరిని భూస్వాములుగజేసి సమిష్టి వ్యవసాయకేంద్రమున సభ్యునిగ జేయవలెను.

దెబ్బలు, జబ్బులు, వృద్ధాప్యం పోషణలకు ప్రభుత్వం, వ్యవసాయదడు చెరిసగం భరించవలెను. కనీస కూలీ నిర్ణయం జరగాలి. బస్తా ఖరీదులో 1-0-0 కి 0-1-0 లేక 0-1-3 పనుల వత్తిడినిబట్టి హెచ్చుకూలి తీసుకొనవచ్చును.

జనరల్ :—వుద్యోగుల లంచగొండితనము, వర్తకుల దోపిడి విధానం, పన్నుల భారము; రైతుల దుణగ్రస్తత నేటి వ్యవసాయాభివృద్ధికి ఆటంకములుగనున్నవి. వీటి నిర్మూలన జరగాలి. రయితు సంఘాలకు కార్మిక సంఘాల Trade Unions ప్రతిపత్తి యివ్వాలి, ఆధునిక వ్యవసాయ పద్ధతులగూర్చి రైలులో వ్యవసాయ ప్రదర్శనాలు, ప్రచురణ ప్రచారం విరివిగా జరగాలి!

మనది పట్టణాల దేశం కాదు పల్లెటూళ్ళ దేశం. పల్లెలకు మరలండి అని కేకలేస్తే చాలదు. పట్టణాలకంటే పల్లెటూళ్లు వాసయోగ్యంగా చేయాలి. పట్టణాలలో నివసించే వర్తకుడు, డాక్టరు; ఆచార్యుడు, ప్లీడరు మొదలగువారు రోటిండి తింటున్నారో యెట్టి ఆరోగ్యవసతుల సౌకర్యాలు; విద్యాసౌకర్యాలు వగయిరా పొందుతున్నారో వాటి నన్నిటికి రయితు రయితుకూలి సమాన ప్రతిపత్తిగా నుండునట్లు సంఘమును ఆర్థిక ప్రతిపత్తిని సంస్కరించాలి. అప్పుడే గ్రామము వ్యవసాయవృద్ధి ఆకర్షవంతముగ లాభదాయకముగ మార్పునొందగలవు.

రైతు ప్రతిపత్తి, రాబడి, కొనుగోలుశక్తి ప్రధమంగా పెంచుట ప్రధానధర్మము. రైతుకూలినికూడ భూస్వామిగా క్రమానుగతముగ మార్పు విధానమును అవలంబించాలి.

# సమీక్షలు

శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు రచయితగా ఆంధ్రలోకానికి చిరపరిచితులు. పురాణ ప్రసిద్ధిగాంచిన ఘంటసాలలో వీరు జన్మించడంలో విశేషముంది. ఆ గ్రామచరిత్రను సమగ్రంగా చిత్రించారు.——— ఇప్పుడు — 'మన రైతుపెద్ద' అనే గ్రంథాన్ని వ్రాశారు.

ఈ రైతుపెద్ద ఎవరో తెలుసా ? శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు— కాంగ్రెసు సేవకులు, గాంధీజీ మనుమలు, పట్టాభి, కృష్ణరావు, నరసింహా త్రయానికి శిష్యుణ్ణని చెప్పుకొన్నవారు. ఆం. రా. కాం. సెక్రటరీగా అఖండ సేవచేసినవారు, జైలునే యిల్లుచేసుకొన్నవారు, త్యాగాన్ని జండాగా ధరించినవారు.

బ్రహ్మయ్యగారు ఆంధ్రదేశానికి తెలియనివారుకాదు. ఒకసారి వారిని చూస్తే మరచిపోవడంకూడా వుండదు. ఆ విగ్రహం, ఆ ఠీవి, ఆ ఆమనయం, ఆ ప్రేమ ఆకర్షిస్తుందందర్నీ. చల్లపల్లి జమీందారుతోపోటీ తెలుగుచరిత్రలో ఒక చక్కటి వీరగాథ, ఇలాటి వెన్నో వున్నాయి వారి జీవితంలో.

ఇలాటి నాయకుల్ని ఎరుగున్నామనుకోవడంతో సరిపోదు. వారి జీవితంలోగల వివిధవిషయాల్ని దగ్గరపెట్టుకొని, ఉన్నత శిఖరానికి వ్యక్తుల్ని తీసుకొనిపోయే దేశసేవలో వారెలావర్తించిందీ తెలుసుకోవడం అవసరం. శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఆ అవసరాన్ని గమనించే ఈ గ్రంథం వ్రాశారా అనిపిస్తుంది. బ్రహ్మయ్యగారి జీవితంలోని ఘట్టాలు ఒక్కొక్కరికి ఒక్కటిగ, కొందరకు అన్నీ వుపయోగించవచ్చు. మరి ఇలాంటిగ్రంథం ఈనాటి పాఠశాలలలో ఎందుకుపెట్టరో తెలియదు.

ఈ గ్రంథానికి 'రైతుపెద్ద' అని నామకరణం చేశారు గ్రంథకర్త. రైతుపెద్దకంటె బ్రహ్మయ్యగారు 'తెలుగుపెద్ద — కాంగ్రెసు భక్తుడు ' 'గౌరవజీవి' త్యాగధనుడు అనిపిస్తుంది. భారతస్వాతంత్ర్యఫలపంట పండించడానికి గాంధీజీ చేసిన కృషిలో బ్రహ్మయ్యగారుకూడా ఒక పెద్దరైతుగ నుపయోగారని చెప్పుకోవచ్చుకూడా.

ఈ గ్రంథాన్నిలా చక్కటి సన్నివేశాలతో, వచనాలతో, కథలతో సమకూర్చిన గ్రంథకర్తకు ధన్యవాదాలు. ఇంకా తెలుగునాయకుల గ్రంథాలు వీరు వ్రాయగలరు. ఇవి కాలానికి కావ్యాలు - ముందు కాలానికి ఉపనిషత్తులు అవుతవి.

—కృష్ణాపత్రిక. 1948 అక్టోబరు 30.

'జగమెరిగిన బ్రాహ్మణుడు' శ్రీ, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు. "రైతుపెద్ద" అంటే సామాన్యంగా శ్రీ బ్రహ్మయ్యగారికి 'ప్రజానామం'గా చెల్లిపోతూ వుంటుంది. యావదాంధ్రావనిలో - ముఖ్యంగా కృష్ణాజిల్లాలో శ్రీ బ్రహ్మయ్యగారి హస్తస్పర్శలేని రాజకీయాలు లేవు. సాంఘిక, ఆర్థిక, సేవారంగాలలో బ్రహ్మయ్యగారు నడయాడని తావులేదు. సుమారు గత పాదశతాబ్ది కృష్ణాజిల్లా చరిత్ర వ్రాస్తే 'బ్రహ్మయ్య' గారు ఏ భిన్నపాత్రనో పోలివుంటారు.

చరిత్ర ప్రసిద్ధిపొందిన తావు(ఘంటసాల)లో జన్మించి, పేరు ప్రతిష్ఠలు గల కుటుంబంలో పుట్టి శ్రీ బ్రహ్మయ్యగారు నిజగ్రామ కుటుంబాల కీర్తి తురాయి గట్టినారంటే అతిశయోక్తి కాదు.

అట్టి 'రైతుపెద్ద' జీవితాన్ని మరో 'రైతుకవి' రచించడం సమంజసంగావున్నది. శ్రీ గొర్రెపాటివారు స్వతః పాలికులు; అయినా కవితావ్యవసాయములో కూడా వారికలం సాఫీగానడచి పూలపంటను పండిస్తుంది. ముఖ్యంగా 'జీవిత చరిత్ర'లను వ్రాయడంలో శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఒక అపూర్వపంథాను అనుసరించారు. ఒక వ్యక్తి జీవితాన్ని తేదీలతో వప్పచెప్పడం నిజానికి 'జీవితకథ' అవుతుంది; కాని చరిత్ర కాదు. కాని శ్రీవారి 'జీవితం' రచనలు నిజమైన 'చరిత్ర'లే అవుతున్నవి. ఒకనాటి సాంఘిక రాజకీయ పర్యాసమస్యలు అందు చర్చితాలై అవి 'చరిత్రలు'గా రూపొందుతూవుండడమే వీరి కలంలోని విశిష్టత.

ఈ 'రైతుపెద్ద' అట్టి వైలక్షణ్యానికి మరో మచ్చుతునక—

మాతృభూమి 7-11-48

